TELUGU DIALECT BULLETIN SERIES-6



# తెలుగు మాండలికాలు

## చిత్తూరు జిల్లా

సంపాదకుడు

డా॥ బూదరాజు రాధాకృష్ణ



తెలుగు అకాడమి

హైదరాబాదు

1983

# సంపాదకీయం

తెలుగు అకాడమీ ప్రచురిస్తున్న తెలుగుమాండలిక పరంపరలో ఇది ఆరోది. ఇంతకు ముందు కరీంనగర్ (1971), కడప, విశాఖ, గుంటూరు (1972), వరంగల్లు (1977) మాండలికాలను గురించి ఇటువంటి గ్రంథాలు అయిదు ప్రచురితమైనాయి. మొదటి అయిదూ ఆంధ్రప్రదేశ్ నట్టనడుమ ఇతర భాషా ప్రాంతాలతో సంబంధంలేని జిల్లాల్లోని భాషావిశేషాలను స్థూలంగా వివరించాయి. సరిహద్దు జిల్లాల్లోని అన్యభాషా ప్రభావమున్న తెలుగు మాండలికాలను గురించి స్థూలంగా వివరించే గ్రంథాల్లో ఇది మొదటిది.

చిత్తూరుజిల్లాలో పర్యటన పరిశోధన 1978-79లో మొదలయింది. అయిదు కేంద్రాలనుంచి విషయసేకరణచేసిన డా. వి. స్వరాజ్యలక్ష్మి 1979 డిసెంబరులో అకాడమి వదలిపెట్టి ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని భాషాశాస్త్ర విభాగంలో చేరటంతో ఈ కార్యక్రమం తాత్కాలికంగా కుంటుపడింది. ఆ తరవాత 1982 లో ఈ పని శ్రీ ఎస్. శంకర మోహనరావు పునరారంభించి నెరవేర్చారు. వారి సేకరణకు పూర్వసేకరణను కలిపి ప్రస్తుత రూపంలో ఈ గ్రంథం ప్రచురిస్తున్నాము. ఆయనదే ఇందులోని ప్రధాన వ్యాసం.

ఈ పత్రికలో చిత్తూరుమాండలికంతో వరంగల్ మాండలికాన్ని పోల్చి చెప్పిన శ్రీ పి. శివానందశర్మ, మహబూబ్‌నగర్ మాండలికంతో పోల్చిన శ్రీ కె. ఆశీర్వాదం కర్నూలు వ్యవహారంతో పోల్చిన శ్రీ కె. రమేశ్‌కుమార్, ఆదిలాబాద్ వాడుకతో పోల్చి చెప్పిన డా. కె. లక్ష్మీనారాయణశర్మల వ్యాసాలు చూడవచ్చు. తెలుగు భాషలో భిన్నమండలాల్లో కనిపించే వైవిధ్యం, మొత్తం మీద కనిపించే ఏకత్వం ఈ పత్రికలో స్థూలంగా తెలుస్తుంది.

ఈ గ్రంథాన్ని ముద్రించిన శ్రీ లక్ష్మీశైలజ ప్రెస్, హైదరాబాద్ వారికి, చిత్తూరు మాండలిక రేఖాపటం గీసిన చిత్రకారుడు శ్రీ ఎ. సోమేశ్వరరావుగారికి మా కృతజ్ఞతలు.

# విషయసూచిక

# చిత్తూరు జిల్లా


అనంతపురం జిల్లా
కడప జిల్లా
నెల్లూరు జిల్లా
మదనపల్లి తాలూకా
వాయల్పాడు తాలూకా
వాయల్పాడు
కాళహస్తి
కాళహస్తి తాలూకా
చంద్రగిరి
చంద్రగిరి తాలూకా
సత్యవేడు తాలూకా
సత్యవేడు
మదనపల్లి
పుంగనూరు తాలూకా
పుంగనూరు
పుత్తూరు
పుత్తూరు తాలూకా
చిత్తూరు తాలూకా
బంగారుపాళెం తాలూకా
కర్ణాటక
పలమనేరు
బంగారుపాళెం
చిత్తూరు
పలమనేరు తాలూకా
తమిళనాడు
కుప్పం తాలూకా
కుప్పం
ఆంధ్రప్రదేశ్

మంది, ఉద్యోగస్తులు 45,973 మంది, స్వేచ్ఛా కూలీలు 65,352 ఇతర పని వారు 2,193 మంది ఉన్నారు. పై జనాభా మొత్తంలో 4,00,880 మంది విద్యావంతులు ఉన్నారు. వారిలో 91,912 మంది స్త్రీలు 3,08,968 మంది పురుషులు. ఈ జిల్లా జనాభాలో ప్రధానంగా హిందువులు (1753157), ముస్లింలు (139015), క్రైస్తవులు (22386) ఉన్నారు. అలాగే ఈ జిల్లాలో ముఖ్యంగా తెలుగు (1460438) తమిళం (289447), ఉర్దూ (130226), కన్నడ (15834) భాషలు మాట్లాడేవారు, మాతృభాషగా గలవారు ఉన్నారు. ఇక్కడి ప్రధానమయిన పంటలు వరి, జొన్న, రాగి, బజ్రా (**Bajra**) వేరుశనగ, మిరప, కంది మొదలయినవి. ముఖ్యమైన చిన్న తరహా పరిశ్రమలు ఈ జిల్లాలో బియ్యం మిల్లులు (48) వేరుశనగమిల్లులు (18) బీడిపరిశ్రమలు (14), రాతిపరిశ్రమలు (10) మొదలయినవి ఉన్నాయి. జాతీయ రహదారి మద్రాసు-చిత్తూరు-బెంగుళూరు చిత్తూరు పట్టణంమీదుగా వెళ్తుంది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు, జిల్లాలోని ముఖ్యమైన ఊర్లకు రోడ్డు సౌకర్యం ఉంది, రైలు సౌకర్యం ఉంది. ఈ జిల్లాలోని దాదాపు ముప్పైఏనిమిది ప్రాంతాలకి రైలు సౌకర్యం, టెలిఫోన్ నిలయాలు ఉన్నాయి. శాంతి భద్రతలు కాపాడేందుకు తాలూకా కేంద్రాలలో, ముఖ్యమైన ఊళ్ళల్లో పోలీస్ స్టేషన్లు ఉన్నాయి. ఈ జిల్లాలో ప్రధానంగా రెడ్డి, కమ్మ, బ్రాహ్మణ, వైశ్య రాజు, సాలీలు, బలిజ, రజక యానాది మొదలగు కులస్థులు ఉన్నారు.

చిత్తూరు జిల్లాలోని వివిధ కేంద్రాలలో 1967-68 లెక్కల ప్రకారం 2539 పాఠశాలలు ఉన్నాయి. అందులో 2,16,927 మంది విద్యార్థులు ఉన్నారు. అలాగే 127 ఉన్నత పాఠశాలల్లో 46,046 మంది విద్యార్థులు ఉన్నారు. చిత్తూరు జిల్లాలోని తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉన్నది. అదిగాక మదనపల్లి, చిత్తూరు, శ్రీ కాళహస్తిలో కాలేజీలు ఉన్నాయి. ఈ జిల్లాలో మెడికల్ కాలేజీ (తిరుపతి) ఇంజినీరింగ్ కాలేజీ (తిరుపతి) పాలిటెక్నిక్ (తిరుపతి), ఆంధ్రప్రదేశ్ అగ్రికల్చర్ విశ్వవిద్యాలయం (తిరుపతి), ట్రైనింగ్ కాలేజీలు వివిధ ప్రాంతాల్లో ఉండి విద్యార్థులకు శిక్షణ ఇస్తున్నవి. చిత్తూరుజిల్లా బహుముఖంగా అభివృద్ధి చెందుతున్న జిల్లా.

పూర్వం చిత్తూరు జిల్లా అంతా ఒక పరిపాలనా భాగంగా ఉండేది కాదు. ఈ జిల్లాలోని పలు ప్రాంతాలు పలువురి అధీనంలో ఆయా సమయాల్లో ఉంటూ ఉండేవి. ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాల్ని మౌర్యులు, శాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, చోళులు, పాండ్యులు, రాయలలు, కుతుబ్‌షాహీలు, మరాఠీ రాజులు మొదలయిన వారు వివిధ చారిత్రక సమయాల్లో పరిపాలించారు. చిత్తూరు 1911 సం॥ వరకు ఉత్తర ఆర్కాట్ జిల్లా భాగమై ఉండేది. ఆ తర్వాత ప్రత్యేక జిల్లాగా రూపొందింది. అప్పుడు

---

చిత్తూరుజిల్లా సమాచారం **Andhra Pradesh District Gazatteers-Chittoor** (1979) నుంచి గ్రహించడమైనది.

అది పలమనేరు, చంద్రగిరి, చిత్తూరు తాలూకాల్లో ఉండేవి. తర్వాత మదన పల్లి, వాయిల్పాడు, పుంగనూరు, శ్రీ కాళహస్తి, పుత్తూరు, తిరుత్తణి ఈ జిల్లాలోకి చేరినవి. అయితే 1960లో వచ్చినపటాస్కర్ అవార్డు మూలంగా తిరుత్తణి తాలూకా మద్రాసులోకి పోయి, తిరువళ్లూరు తాలూకాలోని 76 గ్రామాలు, పొన్నేరి తాలూకాలోని 72 గ్రామాలు ఈ జిల్లా అంతర్భాగం అయి సత్యవేడు తాలూకాగా రూపొందింది. ఈ రోజుల్లోనే కుప్పం, బంగారు పాళెం తాలూకాలుగా మార్చినారు. 1968 వ సంవత్సరం నుంచి చిత్తూరుజిల్లా భౌగోళిక స్వరూపం ఏమీ మార్పు చెందలేదు. పైన ఉదహరించిన మార్పుల వల్లనే తమిళులు, కన్నడిగులు ఈ జిల్లాలో అధిక సంఖ్యలో స్థిరపడి ఉండొచ్చు.

# 2

# విషయ సేకరణ

శ్రీ ఎస్. శంకరమోహన్ రావు

మాండలిక (సామాజిక-భాష) పరిశోధన చేసేముందు ఆ మాండలికానికి సంబంధించిన భాషా సమాచారాన్ని సేకరించాలి. చిత్తూరుజిల్లా భాషా సమాచార సేకరణకు 1978-79 సంవత్సరంలోనే శ్రీకారంచుట్టబడింది. చిత్తూరు జిల్లాలోని తాలూకా కేంద్రాలు పర్యటించి అక్కడ నుంచి సమాచారాన్ని సేకరించాలని నిర్ణయించటం జరిగింది. సమాచార సేకరణ నిమిత్తం ఒక ప్రశ్నావళి తయారు చేయబడింది. ఆ ప్రశ్నావళిలో పదాంశానికి సంబంధించిన నామ పద విభాగం, క్రియావిభాగం సాధ్యమయినంత విశదంగా రూపొందించటం జరిగింది. వీటితోపాటు బాంధవ్య బోధక పదాలు కూడా చేర్చారు. ప్రతి ప్రశ్నావళిలో వ్యవహర్త వ్యక్తిగత (పేరు, వృత్తి, చదువు, వయస్సు మొ॥న) వివరాలు భాషా దృక్పథంతో పొందుపరచటం జరిగింది. పర్యటించిన కేంద్రాలు ఇవి: 1) చిత్తూరు 2) శ్రీ కాళహస్తి 3) చంద్రగిరి 4) వాయిల్పాడు 5) పుత్తూరు 6) సత్యవేడు 7) మదనపల్లి 8) పుంగనూరు 9) కుప్పం 10) పలమనేరు 11) బంగారుపాళెం. ప్రతికేంద్రంలో నలుగురు వ్యవహర్తల నుంచి భాషా సమాచారం సేకరించటం జరిగింది. ఆ నలుగురు 1) రచయిత/టీచర్/లెక్చరర్ 2) డాక్టరు/ప్లీడరు/ఇంజనీరు/ఉద్యోగస్తులు 3) విద్యార్థులు 4) చదువులేని రైతులు, కూలీలు మొదలయినవారు. ఈ వ్యవహర్తల్లో ఒక వ్యవహర్త స్త్రీ అయ్యేట్లుగా సాధ్యమయినంత వరకు ప్రయత్నించాము.

వ్యవహర్తల నుంచి ప్రశ్నావళిని నింపుకోవటంతోనే సేకరణ పూర్తి అవలేదు. ప్రతివ్యవహర్తతో తనకు నచ్చిన లేక తాను మాట్లాడగలిగిన వివిధ విషయాలను సాధ్యమయినంత కలుపుగోలుగా (informal) మాట్లాడించి రికార్డింగ్ చేశాం. ఇవి సంభాషణల రూపంలోను. కథల రూపంలోను, అనుభవాల రూపంలో, అభిప్రాయాల రూపంలో ఉంటాయి ఇవి చాలావరకు వ్యావహారిక రూపంలో ఉంటాయి. ప్రశ్నావళిలోకంటే రికార్డింగ్‌లోనే ఎక్కువ వ్యావహారిక భాషా సమాచారం దొరుకుతుంది. ఈ విధమైన రికార్డింగ్ అనాలోచితంగా (casual) జరిగే ప్రక్రియ. మాండలిక పదజాలం చాలావరకు ఈ రికార్డింగు

ద్వారానే లభించింది. చిత్తూరు జిల్లాలో అధికంగా ఉన్న వివిధ కులాలవ్యక్తుల నుంచి ఈ సమాచారం సేకరించాం. అంటే పైన పేర్కొన్న వ్యవహర్తల లోనే సాధ్యమయినంతవరకు వివిధ కులాలకు చెందిన వారిని ఎంపిక చేయటం జరిగింది. సేకరించిన వారిలో బ్రాహ్మణ, వైశ్య, రెడ్డి, కమ్మ, నాయుడు రాజు, రజక, బలిజ, గాండ్ల, జేరి, పాలఏకిరి, యానాది హరిజన మొదలయిన వివిధ కులాలవారు ఉన్నారు.

చిత్తూరుజిల్లా సమాచార సేకరణ 1982 ఫిబ్రవరి నాటికిపూర్తి అయింది. డాక్టర్ వి. స్వరాజ్యలక్ష్మి మదనపల్లి, పుంగనూర్, కుప్పం, పలమనేరు, బంగారుపాళెం కేంద్రాలలోను, శ్రీ ఎస్. శంకరమోహన్ రావు చిత్తూరు, చంద్రగిరి, శ్రీ కాళహస్తి, వాయిల్పాడు, పుత్తూరు, సత్యవేడు కేంద్రాలలో పర్యటించి సమాచార సేకరణచేశారు. ఈవిధంగాచిత్తూరుజిల్లాలో మొత్తంమీద నలభై అయిదుమంది వ్యవహర్తలనుంచి భాషా సమాచారాన్ని సేకరించడం జరిగింది. ఆ వ్యవహర్తల గురించిన వివరాలు పక్క పేజీలో ఇవ్వబడ్డాయి.

| కేంద్రం పేరు | కులం | విద్య | వృత్తి | వయసు |
|---|---|---|---|---|
| మదనపల్లి | బ్రాహ్మణ | బి.ఎ.ఎల్ ఎల్.బి. | విద్యార్థి | 21 |
| | రెడ్డి | బి.ఎ (II) | విద్యార్థి | 19 |
| | కమ్మ | ఎమ్. ఎ | లెక్చరర్ | 24 |
| | హరిజన్ | చదువులేదు | రైతు | 50 |
| పుంగనూరు | శెట్టి | చదువులేదు | పనిమనిషి | 50 |
| | బ్రాహ్మణ | ఎమ్.ఎస్.సి | లెక్చరర్ | 31 |
| | రజక | బి.ఎ.బి.ఎల్ | అడ్వకేటు | 42 |
| | రెడ్డి | ఇంటర్ (II) | విద్యార్థి | 20 |
| కుప్పం | బ్రాహ్మణ | బి.కామ్.బి.ఎల్. | అడ్వకేటు | 36 |
| | గాండ్ల | ఎమ్.కామ్ | వ్యవసాయం | 25 |
| | దేవగాండ్ల (ఒంటెద్దులగాండ్ల) | ఇంటర్ (I) | విద్యార్థి | 19 |
| | ఒంటెద్దుగాను చెట్టి | చదువులేదు | చిల్లరవ్యాపారం రైతు | 55 |
| పలమనేరు | బ్రాహ్మణ | ఎమ్.ఎ.బి.ఎల్ | అడ్వకేటు | — |
| | బేరి | బి.ఎస్.సి. | టీచర్ | 34 |
| | వైశ్య | ఇంటర్ (II) | విద్యార్థి | 18 |
| | బలిజ | 2 వ తరగతి | లారీ క్లీనర్ | 35 |
| బంగారుపాళెం | పాలపకిరి (స్త్రీ) | బి.ఎస్ సి.బి.ఇడి | టీచర్ | 22 |
| | రెడ్డి | ఎమ్.ఎ. | రాజకీయం | 30 |
| | నాయుడు | ఇంటర్ (II) | విద్యార్థి | 18 |
| | హరిజన్ | చదువులేదు | తలారి | 40 |

# 3

# చిత్తూరు జిల్లా వ్యావహారిక భాష

శ్రీ ఎస్. శంకరమోహన్ రావు

ఆంధ్రప్రదేశ్‌లోని సరిహద్దు జిల్లాల్లో (Peripheral districts) భాషాశాస్త్ర దృష్ట్యా ప్రధానమైన జిల్లా చిత్తూరుజిల్లా. ఈజిల్లాకు పడమట కర్నాటక రాష్ట్రం ఉత్తరాన కడపజిల్లా తూర్పున నెల్లూరు జిల్లా మరియు తమిళనాడు రాష్ట్రం, దక్షిణాన తమిళనాడు రాష్ట్రం ఉన్నాయి. భాషాపరంగా చిత్తూరు జిల్లా రాయలసీమ మాండలికానికి చెందినది. అందుచేత రాయలసీమ సామాన్య లక్షణాలు (general features) ఈ జిల్లాలో సాధారణంగా కనిపిస్తాయి. ఇవిగాక తమిళ, కన్నడ భాషారూపాలు గూడా ఈజిల్లా తెలుగు వ్యావహారికంలో కన్పించడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. కానీ తమిళభాషా ప్రభావమే ఎక్కువ మోతాదులో ఉన్నట్లు పరిశీలనమీదట తెలుస్తున్నది. దీనికి కారణం ఈ జిల్లాకు సమీపప్రధాన వాణిజ్య కేంద్రం మద్రాసు కావటం కావచ్చు, తమిళులు ఎక్కువ సంఖ్యలో ఈ జిల్లాలో స్థిరపడటం కావచ్చు. ఈ జిల్లాలోని సత్యవేడు, పలమనేరు, చంద్రగిరి తాలూకాలు పూర్వం మద్రాసు రాష్ట్రంలోని అంతర్భాగాలు అవటంవల్ల కావచ్చు. లేక ఇవన్నీ కలపికావచ్చు. అలాగే మదనపల్లి, వాయిల్పాడు తాలూకాల్లో కడప వాసన కనిపిస్తుంది. ఈ రెండు తాలూకాలు పూర్వపు కడప జిల్లాలో నుంచి చిత్తూరు జిల్లాలోకి కలిపి వేయబడిన తాలూకాలు. ఈ రకంగా విభిన్న ప్రాంతాల, భాషల ప్రభావం ఈ జిల్లా భాషపై పడింది. ఇవిగాక ఆధునిక తెలుగు ప్రామాణిక భాషగా ప్రస్తుతం అమల్లో ఉన్న కోస్తా జిల్లాల భాషాప్రభావం ఈ జిల్లా విద్యావంతుల భాషలో చాలా ఎక్కువగా కనిపించటం మరో విశేషం. వీటన్నిటి మిశ్రమ భాష చిత్తూరు జిల్లా మాండలిక భాషగా మనం అనుకోవచ్చు.

I చిత్తూరు జిలా విద్యావంతుల వ్యావహారికంలోని వ్యాకరణవిశేషాలు స్థూలంగా పరిశీలిద్దాం.

## I. 1. వర్ణనిర్మాణ విభాగం

.1 విద్యావంతులు తమ వ్యావహారికంలో ఎక్కువగా 'ఏ'ని వాడటం మనం గమనిస్తాం. ఈ 'ఏ' వర్ణం కోస్తాజిల్లాల భాషలో ఎక్కువ కనిపిస్తుంది.

చిత్తూరుజిల్లా విద్యావంతులు ఆధునిక తెలుగు ప్రామాణిక భాషా ప్రభావంవల్ల 'ఏ' ని ఉపయోగిస్తున్నట్లు పర్యటన పరిశోధనలో తెలుస్తున్నది.

| ఉదా: ఆధునిక ప్రామాణికభాష | చిత్తూరుజిల్లా విద్యావంతులు | చిత్తూరుజిల్లా |
|---|---|---|
| చేసేడు | చేసినాడు/చేసేడు | చేసినాడు |
| చూసేడు | చూసినాడు/చూసేడు | చూసినాడు |

పైన ఉదహరించిన భూతకాలపు పదాలు ఆయాజిల్లాల్లో విస్తృతంగా వినవచ్చేవి. అయితే చిత్తూరుజిల్లా విద్యావంతుల భాషలో చేసినాడు/చేసేడు చూసినాడు/చూసేడు రెండురకాలు వినిపిస్తాయి. చేసినాడు, చూసినాడు మొదలయినవి ఈ జిల్లా సామాన్య మాండలిక లక్షణమయితే, చేసినాడు/చేసేడు మొదలయినవి విద్యావంతుల వ్యావహారికంగా మనం అనుకోవాల్సి ఉంటుంది. అలాగే.

| | |
|---|---|
| చేసేవ్ | భవిష్యత్ హెచ్చరికార్థం |
| చేసేవ్ | భూతకాలం |
| వేసేవ్ | భవిష్యత్ హెచ్చరికార్థం |
| వేసేవ్ | భూతకాలం |

పై ఉదాహరణల్లోని భేదకత్వం(Contrast)గమనించినట్లయితే ఈ జిల్లా విద్యావంతుల భాషలోకి 'ఏ' వర్ణం చేరినట్లుగా తెలుస్తుంది. ఇది భాషారూపేణ ఒక పరిణామదశ. ఈ దశ ఒక్క విద్యావంతుల్లో మాత్రమే మనం గమనిస్తాం. విద్యలేని వారి భాషలో 'ఏ' వర్ణం చేరదు.

1.2. అదేవిధంగా ఫ (f) వర్ణం గూడా విద్యావంతుల వ్యవహారంలో అధికంగా కనిపిస్తుంది. దీనికి కారణం ఇంగ్లీషు భాషా ప్రభావం దైనందిన జీవితంలో ఎక్కువగా ఉండటం వల్ల కావచ్చు.

| ఉదా. | | | |
|---|---|---|---|
| | ఫేన్ | /fæ:n/ | 'fan' |
| | కాఫీ | /ka:fi:/ | 'coffee' |
| | టిఫిన్ | /tifin/ | 'tiffin' |

ఈ పై లాంటి ఇంగ్లీషు పదాలకు తెలుగు తద్భవాలు ఏవీ ఇక్కడి ప్రజలు ఆదరించరు. ఆ పదాలు ప్రజల భాషా వ్యవహారంలోకి చొచ్చుకపోయి అవి అన్యదేశ్యాలనే భావనే లేకుండా పోయింది. అందువల్ల వర్ణమాలలో ఈ ఫ (f) ను గూడా చేర్చవలసి ఉంటుంది.

1.3. చిత్తూరుజిల్లా విద్యావంతులు గూడా చాలాసార్లు "శ", "స" వర్ణాలను "స" వర్ణంగా ఉచ్చరించటం జరుగుతున్నది.

ఉదా. శనివారం > సెనివారము
శుక్రవారం > సుక్రవారము
ఆకాశం > ఆకాసెము
శాంతి > సేంతి
శాపం > సేపం
శీతాకాలం > సీతాకాలం మొ॥నవి.

పై విధంగా చూసినట్లయితే "శ" వర్ణం ఇక్కడి శిష్ట వ్యావహారిక భాషా వర్ణమాల నుంచి తొలగించవలసి వస్తున్నది. ఎందుకంటే శు-సు; శి-సి; శ-సె; శా-సే, శబ్దాలలో పై ఉదాహరణల దృష్ట్యా భేదకత్వం కనిపించదు.

1.4. మహాప్రాణత్వం విద్యావంతుల భాషలో వినిపిస్తుంది. అయితే దాన్ని వారు అట్టే పట్టించుకొంటున్నట్లులేదు. ఎందుకంటే ఒకే వ్యవహర్త ఒకసారి మహాప్రాణత్వంతో వాడిన పదాలు మరోసారి అది లేకుండా ఉపయోగించిన సందర్భాలు చాలా ఉన్నాయి.

ఉదా. లాభం/ లాబం
భయం/ బయం మొ॥నవి.

1.5. తాలవ్యీకరణాలు, సమీకరణాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

సత్యం > సచ్చెం
నిత్యం > నిచ్చెం
మధ్య > మజ్జె
వైద్యం > వైజ్జెం

1.6. వర్ణమార్పులు

డ/ళ అప్పడం > అప్పళం
ఒ/ఇ నొప్పి > నెప్పి
ఆ/ఏ రాత్రి > రేత్రి

## I. 2. పదాంశ విభాగం

2. 1. *నామపద విభాగం :*

2. 1. 1. *బహువచనం :* తెలుగులో సాధారణ బహువచన ప్రత్యయం-లు.

తట్ట-లు
మడక-లు
పిలకాయ-లు

పదం చివర బహువచన ప్రత్యయం చేరినప్పుడు ఈ కింది మార్పులు జరుగుతున్నాయి.

అంగడి > అంగళ్- > అంగళ్ళు

*2. 1. 4.* సంఖ్యావాచకాలు : ఈ జిల్లాలో ప్రత్యేకంగా కనిపించే కొన్ని సంఖ్యావాచక పదాలు గమనిద్దాం.

ఈ జిల్లాలో 'పదహైదు' (పదిహేను) ఎక్కువగా ఉంది. ఇక్కడ 'వంద'కు బదులు 'నూరు' పదం విరివిగా ఉపయోగిస్తూ ఉంటారు.

ఉదా:- 'నూరు మంది వచ్చినారు' అలాగే.

| | | |
|---|---|---|
| ఉదా॥ ఇన్నూర్రు | '200' | |
| మున్నూర్రు | '300' | |
| నన్నూర్రు | '400' | |
| ఐనూర్రు | '500' | మొ॥నవి. |
| ఇన్నూర్రట రొండు | '202' | |
| మున్నూర్రటొకటి | '301' | |
| వేయి/వెయ్యి | 1000 | |
| వేయిన్ని/వెయ్యినొన్నకటి | 1001 | |
| వేయిన్ని/వెయ్యిన్నిరొండు | 1002 | |

ఈ రకంగా సంఖ్యలు వాడుతూ ఉంటారు. అలాగే 1947 అని అనడానికి వేయిన్ని/వెయ్యిన్ని తొమ్మిదొందల/తొమ్మనూట నలభై ఏడు అని అనడం మనం గమనించవచ్చు. ఇది ప్రామాణిక భాషలో పంధొమ్మిదొందల నలభై ఏడుగా అనడం కద్దు. ఈ రకమయిన విలక్షణత ఈ జిల్లాలో కనిపిస్తుంది. అదే విధంగా మనుషుల్ని లెక్కించేటప్పుడు

ఒక్కరు
ఇద్దరు
ముగ్గరు
నలగరు
ఐదుమంది
ఆరుమంది

ఇలా సాగుతుంది - మంది ఐదు సంఖ్యనుంచి చేర్చటం మొదలవుతుంది. పై ఉదాహరణలను గమనించినట్లయితే ముగ్గరు, నలగరు సంఖ్యా పదాలలోని ఊర్ధ్వాచ్చు సామ్యం(Analogy) వల్ల నిమ్నాచ్చు అయినట్లు తెలుస్తున్నది. సామాన్యంగా ఈజిల్లా తెలుగులో రెండవఅక్షరం (syllable)లోని ఊర్ధ్వాచ్చు నిమ్నాచ్చుగా మారటం జరుగుతున్నది. ఈ ఉదాహరణలను చూడండి.

కలగతా ఉంది
చెప్తొండాను
అలిగతా ఉండాడు
తిర్గతా ఉంటాడు

ఇ_స్తన్నారు

'ఉ' కారం > 'అ' కారం కావటం స్పష్టంగా కనిపిస్తున్నది.

## 3. క్రియా విభాగం

*3. 1.* సకర్మక — అకర్మక క్రియలు : అకర్మక క్రియలకు —పు, —ఇంచు/పిచ్చు చేర్చటం ద్వారా సకర్మక క్రియలవుతున్నవి. ఇవే ప్రత్యయాలు సకర్మక క్రియలకు చేరినప్పుడు ప్రేరణార్థక క్రియలుగామారుతున్నవి.

ఉదా : అకర్మక > సకర్మక

బతుకు > బతికించు

నిలుచు > నిలుపు

సకర్మక > ప్రేరణార్థక

దున్ను > దున్నిపిచ్చు

చదువు > చదివించు

*3.2.* సమాపక క్రియలు :

3. 2. 1. ప్రార్థనాద్యర్థకం : ప్రత్యేకంగా ఇక్కడి తెలుగులో చెప్పుకోవాల్సినవి "లేచ్" "ఇచ్చ్" "ఏడ్చ్" మొదలగు ధాతువులు. ప్రార్థనాద్యర్థకంలో ఇవి.

లేచ్ > లెయ్

ఇచ్చ్ > ఈ

ఏడ్చ్ > ఏడ్చు/ఏడుపు

అలాగే కల్సండి/కలండి/కలవండి, పిల్సండి/పిలవండి ప్రార్థనాద్యర్థక బహువచనంలో వినిపిస్తున్నవి. బహువచనంలో —అండి చేరుతున్నది.

ఉదా : లెయ్యండి

ఈండి

3. 2. 2. నిశ్చయార్థకం : చిత్తూరు జిల్లాలో ఎక్కువగా —ఆల ప్రత్యయం ధాతువుకు చేరటం జరుగుతుంది.

పోవాల

తినాల

కావాల

అలాగే సత్యవేడు, పుత్తూరు వైపు -వ/వాల ప్రత్యయ్యం కూడా నిశ్చయార్థకంలో వాడుతున్నారు.

చేయవాల

ఉండవాల

తిన వల మొ॥నవి.

3. 2. 3. తద్ధర్మార్థకం : తద్ధర్మార్థకం ప్రయోగాలు విభిన్న రీతుల్లో ఈ జిల్లా తెలుగువారు వ్యవహరిస్తున్నారు.

| ప్రత్యయం | ప్రయోగం |
|---|---|
| -తున్-/-టున్- | పోతుంది |
| | ఉంటుంది |
| -త-/ -ట- | జర్గుతయ్ |
| | ఉంటయ్ |
| -తా-/-టా- | పెడ్తారు. |
| | అంటారు |

-తున్-/-టున్- ప్రత్యయం వచ్చేచోట-తా-/-టా-లు పర్యాయరూపాలుగా కనిపించటం విశేషంగా కనిపిస్తుంది.

ఉదా : పెరుగుతాది / పెరుగుతుంది
అయిపోతాది / అయిపోతుంది
జర్గతాది / జర్గుతుంది
ఉంటాది / ఉంటుందీ మొ॥నవి

క్వాచిత్కంగా పోతది, పోద్ది, పోతురు, అవుద్ది, అయిపోయుందుము, ఉంటది, అయితది, వస్తది లాంటి ప్రయోగాలు కూడా జిల్లా శిష్ట వ్యవహర్తల భాషలో దొర్లుతుంటాయి.

*3. 2. 4.* భూతకాల ప్రత్యయాలు :

1. మహదితర పురుష ప్రత్యయం ముందు -ఇన్- ప్రత్యయం వాడుకలో ఉంది.

అయింది
పడింది
చేసింది
జర్గింది మొ॥నవి.

2. ఇతర పురుష ప్రత్యయాలముందు 'ఏ' / -ఇనా- ప్రత్యయాలు విస్తారంగా కనిపిస్తున్నవి.

చేసేడు / చేసినాడు
కట్టేడు / కట్టినాడు

-ఇనా- జిల్లా భూతకాలిక ప్రత్యయంగా పేర్కొవచ్చు.

పడినాము
కొట్టినారు
పెట్టినారు

అప్పుడప్పుడు వీరి భాషలో పడినేము, కొట్టినేరు లాంటివికూడా వినిపిస్తున్నవి.

3. నకారాంత ధాతువు తర్వాత 'ఏ' కానీ 'అ' కానీ భూతకాలిక

ప్రత్యయంగా వాడుతూ ఉన్నారు.

| ఏ | ఆ | |
|---|---|---|
| తిన్నేడు | అన్నాడు | |
| కొట్టుకొన్నేరు | ఉన్నాయి | |
| అనుకొన్నేము | విన్నాము | మొ॥నవి. |

4. పై భూతకాలిక ప్రత్యయాల్తోపాటు -తి- / -టి- కూడా అప్పుడప్పుడు శిష్ట వ్యవహర్తలు తమ భాషలో వినియోగించటం జరుగుతున్నది. ఈ మార్పుతో పాటు పురుష ప్రత్యయాల్లోగూడా మార్పురావడం గమనార్హం. ఉత్తమ, మధ్యమ పురుష ఏకవచనంలో వరసగా -ని, -వి; బహువచనంలో -మి, -రు; పురుష ప్రత్యయాలుగా ఉన్నాయి.

| ఉదా : | -తి- | -టి- |
|---|---|---|
| | దిగబెట్టిని | అనుకొంటిని |
| | చెప్తిని | ఉంటిమి |
| | ఏమార్చితివి | అనుకొంటిరి |

5. చిత్తూరు జిల్లా తెలుగులో 'ఉండు' క్రియాప్రయోగంలో విశిష్టత ఉన్నట్లు తెలుస్తున్నది. భవిష్యేతర కాలాల్లో ఉండ్-ఆ/ఉన్న్-ఆ/అ ఉన్న్-ఏ ప్రత్యయాలు అన్ని పురుష ప్రత్యయాల ముందు వాడుకలో ఉన్నాయి.

| ఉదా : | ఉండ్-ఆ | ఉన్న్-ఆ/అ | ఉన్న్-ఏ |
|---|---|---|---|
| | ఉండాడు | ఉన్నాడు | ఉన్నేడు |
| | ఉండాది | ఉన్నది/ఉన్నాది | ఉన్నేది |
| | ఉండారు | ఉన్నారు | ఉన్నేరు |

పై ప్రయోగాల్తోపాటు ఏకవచన మహదితర పురుష ప్రత్యయం ముందు మాత్రమే -ఇన్- ప్రత్యయం చేరటం విశేషం.

*ఉండింది*

ఇది సుదూర భూతకాలాన్ని సూచిస్తున్నది.

ఉదా : మడి ఉండింది (ఎప్పుడో వెనక వరిపొలం ఉన్నదనే అర్థంతో)

ఈ రకమైన విలక్షణత చిత్తూరు జిల్లాలోనేగాక ఇతర జిల్లాల్లోకూడా ఉందో లేదో పరిశీలించవలసి ఉంది.

6. పై భూతకాల ప్రత్యయాలతోపాటు అప్పుడప్పుడు -ఎ- ప్రత్యయంకూడా వాడుక భాషలో గమనించవచ్చు.

ఉదా : తీసుకోవాల్సి వొచ్చె

లేకపాయె

చేయకపాయె మొ॥నవి.

7. ఉత్తమ పురుష ఏక వచనంలో పురుష ప్రత్యయం లేకుండా కూడా క్రియారూపాలుంటాయి. ఇది తెలుగు భాష సామాన్య భాషా లక్షణం.

పోయినా (ను)
చేసినా (ను)
తిన్నే (ను)

ఈ విధంగా భూతకాల ప్రత్యయ వినియోగంలో భిన్నత్వం గోచరిస్తున్నది.

3.2.5. ఉభయ ప్రార్థ నార్థ కం (Hortative).

సాధారణంగా శిష్టుల్లో ధాతువుకు - 'దామ్' ప్రత్యయం చేర్చటంద్వారా ఇది ఏర్పడుతుంది.

ఉదా : చేద్దాము.
వెళ్దాము.

ఈ జిల్లాలో పై ప్రత్యయంతోపాటు—'తామ్' కూడా ఉండటం విశేషం.

ఉదా : చెప్తాము
చూస్తాము
చేస్తాము

పై-తామ్ ప్రయోగాలు సాధారణంగా భవిష్యత్కాలాన్ని, సామర్థ్యార్థకాన్ని కూడా సూచిస్తాయి. సామర్థ్యార్థకంలో సామాన్యంగా తు మర్థకానికి-*గల*/-*గలుగు* చేరుతుంది. చేరకపోతే కూడా ఆ అర్థం పై ఉదాహరణ ప్రయోగాలు సూచిస్తాయి. ఉభయ ప్రార్థనార్థకంలో పై ప్రయోగాలువాడటం ఈ మాండలికం తెలుగు విశేషమని చెప్పుకోవచ్చు.

## 3.3 అసమాపక క్రియలు

3.3.1. *శత్రర్థకం* : ఈ జిల్లాలో సాధారణంగా ధాతువుకు తా-/టా ప్రత్యయం + ఉండు చేర్చి అవధికని సూచించవచ్చు.

ఉదా : అంటా ఉండారు.
జర్గుతా ఉన్నై.
వస్తా ఉండాయి.
అల్లాడిపోతా ఉండారు.
మాట్లాడతా ఉండాము మొదలగునవి.

అలాగే పై ప్రత్యయంతోపాటు తూ- / టూ- ప్రత్యయం కూడా శిష్ట వ్యవహారంలో ఉన్నది. ఒక్కొక్కప్పుడు రెండూ ఒకే శిష్ట వ్యవహార్తలోనే కనిపించటం కద్దు.

ఉదా : అనువదిస్తూ ఉండారు

చేస్తూనే ఉంది
పడిపోతా ఉంది
పని చేస్కొంటా ఉండాడు మొదలగునవి.

3.3.2. క్త్వార్థకం : ధాతువుకు -ఇ ప్రత్యయం చేరి క్త్వార్థకం ఏర్పడుతుంది.

ఉదా : చేసి
వచ్చి
తిని

3.3.3. అప్యర్థకం : ధాతువుకు - ఇనా/-నా చేర్చటం ద్వారా అప్యర్థకం ఏర్పడుతుంది.

ఉదా : ఇచ్చినా
చేసినా
ఉన్నా

పై వాటితోపాటు చేదర్థక ప్రత్యయమైన -తే/ - టే (+ కూడా అప్యర్థ కార్థంతో ప్రయోగించటం కూడా జరుగుతున్నది.

ఉదా : వస్తే గూడా 'వచ్చినా'
చేస్తే గూడా 'చేసినా'
ఇస్తే గూడా 'ఇచ్చినా'

3.3.4. చేదర్థకం : ధాతువుకు - తే / - టే చేర్చడం ద్వారా ఇది ఏర్పడుతుంది.

ఉదా : ఉంటే
ఎత్తుకొని పోతే
చదివితే మొదలగునవి

'అను', 'ఉండు' ధాతువులకు చేదర్థక ప్రత్యయం చేర్చి వ్యవహరించటం చాలా సాధారణంగా ఇక్కడ జరుగుతున్నది.

ఉదా : 'అను' —— సహకరించినామంటే
మాట్లాడినామంటే
పోయినామంటే
'ఉండు' చేసుంటే
చూసుంటే

3.3.5 తుమర్థకం : ధాతువుకు - 'అ' ప్రత్యయం చేర్చటం ద్వారా తుమర్థకం సాధించటం జరుగుతుంది.

చేయ్ - > చేయ -
తిన్ - > తిన -

3.3.6. తద్ధర్మ విశేషణం : ధాతువుకు - 'ఏ' ప్రత్యయం చేరుతుంది.

ఉదా : చెప్పే విషయం

చదివే పుస్తకము

3.3.7. క్త్వ దర్థకం : - ఇన ప్రత్యయం ధాతువుకు చేరుతుంది.

చూసిన - వాళ్ళు

చేసిన-పని మొదలగునవి.

3.3.8. భావార్థకం : ధాతువుకు - ఏది ప్రత్యయం చేరి భావార్థకం అవుతున్నది.

ఉదా : ఉండేది

చేసేది

తినేది

పెట్టేది

వీటితోపాటు ప్రామాణిక భాషా రూపాలు *ఉండటం, చేయటం, తినటం, పెట్టటం,* వంటివి కూడా శిష్టుల్లో ఉన్నాయి. ఈ రూపాలు ధాతువుకు -అటం చేర్చటంవల్ల ఏర్పడ్డాయి. ఈ జిల్లా భావార్థకాలకి - అనికి చేరి చతుర్థీ విభక్త్యర్థం వస్తుంది.

ఉదా ; ఉండేదానికి 'ఉండటానికి'

చేసేదానికి 'చేయటానికి'

కొట్టేదానికి 'కొట్టటానికి'

3.3.9. సామర్థ్యార్థకం : తుమర్థక రూపానికి - గల/- గలుగు ప్రత్యయం చేర్చటం ఇక్కడ కనిపిస్తుంది.

ఉదా : చేయగలుగుతున్నాం

కట్టగల్గుతాము

చెప్పగల్గుతాడు మొదలగునవి.

లోగడ ఉదహరించినట్లు ఉభయ సంప్రార్థనార్థక రూపాల ద్వారాను తద్ధర్మార్థక రూపాల ద్వారా కూడా సామర్థ్యార్థకాన్ని వాడుతూ ఉంటారు.

చెప్తాము 'చెప్పగలం'

చూస్తాము 'చూడగలం'

తింటాము 'తినగలం'

3.3.10. వర్తమానకాలిక ప్రత్యయం : -త- ప్రత్యయం వర్తమానాన్ని సంకేతిస్తుంది. అయితే ఇదెప్పుడూ 'ఉండు' క్రియతో చేర్చిమాత్రమే ఉపయోగిస్తుంటారు.

చేస్తున్నారు

ఉంటున్నారు

చెప్తుండారు

ఈ ప్రయోగాలతోపాటు *చేస్తండారు, చదవుతాంది,* ఇస్తన్నారు లాంటివి కూడా ఇక్కడ ఎక్కువగానే ప్రచురంలో ఉన్నాయి. 'ఉండు'లోని ఉ > అ అయిన సందర్భాలు ఇవి.

## 4. క్రియాపద బంధాలు

-పడు, -పో, -పెట్టు, -తీస్, -అవ్, -వచ్చు, -ఆడు, -చేయు, -కొను, -తిను, -వేయు, -ఎత్తు మొదలయిన సహాయక క్రియలు చేర్చటంవల్ల క్రియాపద బంధాలు ఈ మాండలికంలో ఎక్కువగా ఏర్పడుతున్నాయి.

| | | |
|---|---|---|
| ఉదా : | -పడు | తంటాలుపడు |
| | -పో | నిలిచిపో |
| | -పెట్టు | ఎండబెట్టు |
| | -ఆడు | దెబ్బలాడు |
| | -కొను | అద్దుకొను |
| | -కొట్టు | మందుకొట్టు, డూవ్‌కొట్టు |
| | -వేస్ | కుప్ప ఏసుకొను |
| | -ఎత్తు | బిచ్చమెత్తు |
| | -తీస్ | గుంతలు తీయు |
| | -అవ్ | బంద్ అవు |

ఈ విధంగా క్రియాపద బంధాలు సహాయక క్రియలవల్ల ఏర్పడుతున్నాయి.

## 5. ప్రతిషేధం

ప్రతిషేధం ఈ మాండలిక తెలుగులో ఈ కింది విధాలుగా ఉన్నది.

5.1. వ్యతిరేక ప్రత్యయమైన "-అ-" సమాపక క్రియాధాతువుకు చేరి వ్యతిరేక భవిష్యత్తు ఏర్పడుతుంది.

ఉదా : చెప్పదు
ఇవ్వరు
చేయడు
మాట్లాడరు

5.2. వ్యతిరేక క్త్వార్థక ప్రత్యయమైన "-అక-" తుమర్థకానికి చేర్చటం వల్ల సాధించబడుతున్నది.

రాక
చేయక
తినక

5.3. వ్యతిరేక విశేషణ ప్రత్యయమైన -"అని" తుమర్థకానికి చేర్చటంవల్ల ప్రతిషిద్ధ క్రియారూపాలొస్తాయి.

కాని-
చేయని-

వినని-

5.4. -లేదు/-లే ; వొద్దు/వద్దు ; కూడదు వంటి సమాపక పదాలు తుమర్థకానికి చేర్చినప్పుడు ప్రతిషేధం సిద్ధిస్తుంది.

| | |
|---|---|
| ఉదా : | "చూడలేదు" |
| | "తినలేదు" |
| (వ్యతిరేక ప్రార్థనార్థకం) | "రావొద్దు" |
| | "పోవొద్దు" |
| | "తినబాకు" |
| (నిషేదార్థకం) | 'తాగకూడదు' |
| | 'లెయ్‌గూడదు' |
| (వ్యతిరేక సామర్థ్యార్థకం) | 'చేయలేరు' |
| | 'తినలేను' |
| | 'రాలేము' |

పై ప్రయోగాల్తోపాటు ఈ కింది వ్యతిరేకార్థక క్రియారూపాలు ఈ జిల్లా విద్యావంతుల వాడుకభాషలో వినిపిస్తాయి.

| ఉదా : చిత్తూరు జిల్లా | 'అర్థం' |
|---|---|
| చెప్పంది ఏమీ లేదు | చెప్పకూడనిది ఏమీ లేదు |
| చెప్పబడిలే | చెప్పాల్సిన అవసరం లేదు |
| తినేది లేదు | తినడం లేదు |
| లేకుండా ఉండింది | లేదు |
| లేకుండా పోతే | లేకపోతే |

కాకుండా, లేకుండా, నమ్మకుండా మొ॥న రూపాలు ఇక్కడ వినిపిస్తూ ఉన్నవి.

ఇంత వరకు చిత్తూరు జిల్లాలోని విద్యావంతుల వ్యావహారిక భాషలోని వ్యాకరణ విశేషాలు స్థూలంగా పరిశీలించాము.

II

చిత్తూరు జిల్లాలోని శిష్టేతరుల వ్యావహారికాన్ని గూడా విహంగ దృష్టితో పరిశీలించినట్లయితే ఈకిందివ్యాకరణవిశేషాలుస్థూలంగాతెలియవస్తాయి.

## II. 1 వర్ణనిర్మాణ విభాగం

1.1 మహాప్రాణత్వలోపం ఎక్కువగా వీరి ఉచ్చారణలో కనిపిస్తుంది.

ఉదా : బార్య < భార్య
బాగం < భాగం
బవనాలు< భవనాలు

---

విద్యావంతులను శిష్టులుగాను, నిరక్షరాస్యుల్ని శిష్టేతరులుగాను భాషా దృక్పథంతో విభజించి వ్యవహరించటం ఈ వ్యాసంలో జరిగింది.

బాదలు < బాధలు

1.2. పదాది వకార లోపం గూడా వీరి భాషలో ఎక్కువే.

ఎల్తురు < వెలుతురు

ఇత్తనం < విత్తనం

ఏలు < వేలు

ఏకువజాము < వేకువజాము

'వ' కారము నిలిచిన సందర్భాలు కూడా వీరిలో కనిపిస్తాయి. అయితే శిష్టుల్లో కనిపించినంత మోతాదులో వీరిలో కనిపించవు.

1.3. మూర్ధన్య లోపం సామాన్యంగా కనిపించే విశేషం.

వొల్లు < వొళ్ళు

ఎల్లినా < వెళ్ళినాను

ఈల్లు < వీళ్ళు

1.4. పదాది చకారం ఈ జిల్లాలో ఎక్కువగానే వినిపిస్తున్నది. అయితే నిరక్షరాస్యుల వ్యావహారికంలో 'చ > స' గా మారిన సందర్భాలు కూడా చాలా కనిపిస్తాయి. మచ్చుకు కొన్ని ఉదాహరణలు చూడండి.

ఉదా : సేత్తే < చేస్తే

సావాల < చావాలి

సొప్ప < చొప్ప

అగసాట్లు < అగచాట్లు

సుట్టాలు < చుట్టాలు

సాలు < చాలు (పోలిక)

సూసినా < చూచినాను

సేత్తారు < చేస్తారు

సక్కరాలు < చక్రాలు మొ॥నవి.



1.5 పదాది హ కారం లోపిస్తుంది.

ఐరేటు < హైరేటు (ఇంగ్లీషు)

1.6. కొన్ని స్వరాల మార్పులు చూడండి.

| స్వరం | చిత్తూరు జిల్లా | | ప్రామాణిక భాష |
|---|---|---|---|
| అ/ఇ | అబ్బాయ | - | అబ్బాయి |
| ఒ/అ | మొగ్గం | - | మగ్గం |
| ఎ/ఒ | నెప్పి | - | నొప్పి/నెప్పి |
| ఎ/అ | దెయ్యాం | - | దయ్యాం |
| ఏ/ఆ | రేత్రి | - | రాత్రి |

1.7. అలాగే వ్యంజనాల్లో వచ్చిన కొన్ని మార్పులు చూద్దాం.

| వ్యంజనం | త్తూచిరు జిల్లా | ప్రామాణిక భాష |
|---|---|---|
| ళ/డ | అప్పళం | అప్పడం |

| | | |
|---|---|---|
| జ/ద | సద్ద | సజ్జ |
| గ/వ | పిలగాడు | పిలవాడు |

1.8. వర్ణసమీకరణాలు : ఈ జిల్లాలోని విద్యలేని వారి వ్యావహారికంలో సాధారణంగా ఈ కింది సమీకరణాలు ఎక్కువగా వినిపిస్తాయి.

| పదం | వ్యావహారిక రూపం | సమీకరణం |
|---|---|---|
| సేద్యం | సేద్దెం | ధ్య > ద్దె |
| లక్షణంగ | లచ్చెనంగ | క్ష > చ్చె |
| సంవత్సరం | సమచ్చరం | త్స > చ్చ |
| ఎట్లా | ఎట్టా | ట్ల > ట్ట |
| చేస్తారు | సేత్తారు | స్త > త్త |
| లగ్నం | లగ్గం | గ్న > గ్గ |

1.9. పద మధ్యంలోని సంయుక్తాక్షరాలను శిష్టేతరులు సాధారణంగా ఈ కింది విధంగా మారుస్తారు.

ముద్రలు > ముద్దర్లు
నిద్ర > నిద్దర
చక్రాలు > సెక్కరాలు

1.10. నిత్య వ్యవహారంలో తప్పని సరిగా ఎదురయ్యే ఇంగ్లీషు పదాలను ఈ కింది విధంగా మార్చి లేక తేలిక పరచి మాట్లాడుతూ ఉంటారు.

| | పలికిన తీరు | | ఇంగ్లీషుపదం | పలకవలసిన విధానం |
|---|---|---|---|---|
| ('ర' కారలోపం) | పెసిడెంటు | - | **President** | ప్రెసిడెంట్ |
| (మూర్ధన్యలోపం) | మిసన్ | - | **Machine** | మిషన్ |
| ('న' కారలోపం) | సిమిటీ | - | **Cement** | సిమెంట్ |
| | డిమాస్ట్రేటరు | - | **Demonstrator** | డిమాన్‌స్ట్రేటర్ |

## II. 2. పదాంశ విభాగం

శిష్టేతరుల్లో పదాంశ విభాగానికి సంబంధించిన కొన్ని ముఖ్యమైన విషయాలు మాత్రం చూద్దాం.

### *2.1.* నామవిభాగం :

2.1.1. బహువచన ప్రత్యయమైన - లు శిష్టుల్లో ళ్ - ముందు ళ్-గా మారటం లోగడ మనం గమనించాం. మూర్ధన్య లోపం అధికంగా గల శిష్టేతరుల్లో బహువచనం ఈ కింది విధంగా జరుగుతుంది.

కాలు > కాల్లు
నీరు > నీల్లు
వారు > వోల్లు

2.1.2. నామ ప్రత్యయాల ప్రయోగంలో కొంత తేడా ఉంది.

ఉదా : కాడ 'దగ్గర'

ఇంటికాడ
మడికాడ

అలాగే 'కాడ' నామ ప్రత్యయం రెంటిని పోల్చేటప్పుడు కూడా వీరు వాడతారు.

ఎద్దల కాడికి 'ఎద్దులకంటే'

క్రియల తర్వాత ప్రత్యయంగా కూడా ఈ 'కాడ' ప్రయోగం ఉంది.

చెప్పేకాడికి 'చెప్పేసరికి'

అదే విధంగా - బంటి (-బట్టి) కోసం (వలన, గురించి అర్థంలో) - ఆల (-వేళ) మొదలయినవి వీరు ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటారు.

ఉదా : రెండేండ్ల బంటి - రెండేళ్ళబట్టి
పొద్దుటాల - పొద్దునపూట

2. 1. 3. ప్రశ్నార్థకాలలో 'ఏ'-కి బదులు 'యా-' విరివిగా వాడుతున్నారు.

యావూరు? 'ఏ ఊరు?'
యాందియ్యా? 'ఏందయ్యా?'
యాడికి? 'ఎక్కడికి?'

## 3. క్రియావిభాగం

శిష్టేతరుల్లోని క్రియా ప్రయోగాలకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన వాటిని పరిశీలిద్దాం.

*3. 1.* ప్రార్థనాద్యర్థకంలో 'కూకో'(కూర్చో), దా,(రా) నిల్చుకో (నిలబడు) లెయ్ (లే), పడ్చు (పడువు). కల్సు (కలువు) మొదలయినవి విలక్షణంగా వినిపిస్తాయి.

*3. 2.* తద్ధర్మార్థకం : విద్యావంతుల్లో మాదిరి వీరిలోకూడా -తా-/-టా- లు ప్రత్యయాలుగా ఉన్నాయి. అయితే వీటి హ్రస్వరూపాలు -త-/-ట- కూడా ప్రత్యామ్నాయంగా వాడటం జరుగుతున్నది.

ఉదా : వొత్తది
సేత్తరు
పెడ్తం
ఉంటాది
చేస్తాది
తింటాది మొ॥నవి.

*3. 3.* భూతకాల ప్రత్యయాలు : శిష్టుల్లోమాదిరి శిష్టేతరుల్లో 'ఏ' ప్రత్యయం అధికంగా కనిపించదు. ఎక్కడో ఒకరిద్దరు వ్యవహర్తలు 'ఏ' ని

వాడిన సందర్భాలు ఉన్నాయి. అయితే మొత్తంమీద సాధారణంగా -ఇనా- ప్రత్యయం వీరు ఉపయోగిస్తూ ఉంటారు.

ఉదా : సూసినా
ఎల్లినా
*పూడ్సినారు మొ॥నవి.

పై ప్రయోగాల్తో పాటు వాడుక భాషలో ఈ కిందివికూడా వినిపిస్తూ ఉంటాయి.

ఉంటిమి/ఉండాము
ఉండె
ఉండింది
వస్తిని/వచ్చింటి/వస్తి
ఉన్నేము మొ॥నవి.

3. 4. ఉభయ ప్రార్థనాద్యర్థక ప్రయోగం మామూలుగా తద్ధర్మార్థక రూపంలో వీరు వాడుతూ ఉంటారు.

చెప్తాము 'చెబ్దాము'
చూస్తాము 'చూద్దాము'

-దామ్ ప్రత్యయ వినియోగంకూడా వినిపిస్తుంది.

ఈ విధంగా భాషారూపేణా శిష్ట, శిష్టేతరులమధ్య కొన్నిచోట్ల సామ్యం మరికొన్నిచోట్ల విభేదాలు కనిపిస్తూ ఉంటాయి.

## III కొన్ని మాండలిక సామాన్య లక్షణాలు

ఇంతవరకు పరిశీలించిన వ్యాకరణ విశేషాల్తోపాటు చిత్తూరు జిల్లా మాండలికంలో ఈ కింది విశేషాలుకూడా వ్యావహారికంలో వినవస్తూఉంటాయి.

1. పదాంత-ము ఇక్కడ సామాన్యంగా నిలుస్తూ ఉంటుంది.

ఉదా : వస్తాము
తింటాము
మేము

2. సామాన్యంగా పదంలోని రెండవఅక్షరం(syllable)లోని ఊర్ధ్వాచ్చు (high vowel) 'ఉ' కారం 'అ' కారంగా మారుతుంటుంది. ఈ రకమైన స్వర నిమ్నీకరణ ఈ జిల్లా తెలుగులోని ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు.

ఉదా: అలగతా ఉన్నేడు 'అలుగుతూ'

---

*'పూడ్సినాడు' ప్రయోగం తమిళ భాషాప్రభావంవల్ల వచ్చి ఉండొచ్చు. తమిళంలో 'పోయివిట్టాన్' అని రాస్తారు, 'పోయిటాన్' అని పలుకుతారు. భూతకాలప్రత్యయం-ఇనా-, పురుషప్రత్యయం-డు తెలుగుకి సంబంధించినవి అయి, 'పూడ్సి' మాత్రం తమిళానికి సంబంధించటం విశేషం. ఈ అంశాన్ని విశదంగా పరిశీలించవలసి ఉంది.

| | |
|---|---|
| నలగరు | 'నలుగురు' |
| ఎద్దలను | 'ఎద్దులను' |
| అమ్మతారు | 'అమ్ముతారు' |
| ముగ్గరు | 'ముగ్గురు' |

ఈ పై ప్రయోగాలకు కారణం బహుశా మాండలిక శత్రర్థక ప్రత్యయమైన -తా-/-టా- వాడకం కావచ్చు; సామ్యం (analogy) కావచ్చు. చిత్తూరు జిల్లా మాండలికంలోని ఈ ప్రత్యేకతను సునిశితంగా పరిశీలించవలసి ఉంది. పై విలక్షణతకు విరుద్ధంగా ఈ కింది ప్రయోగాలుచూడండి.

అందురు < అందరు

ఇప్పుటికి < ఇప్పటికి

ఇవికూడా ఇక్కడి భాషా వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తున్నవే.

3. తమిళభాషా ప్రభావం పదజాలంలో చాలా ఎక్కువగా కనిపిస్తుంది. ఒకొక్కక్కప్పుడు సగం తెలుగు, సగం తమిళం అయిన ప్రయోగాలు ఇక్కడ వినిపిస్తూ ఉంటాయి.

3. 1. పదం తెలుగు, ప్రత్యయం తమిళం :

ఇదే బతుకు దా

కనిపెట్టేవాళ్ళ దా లేరు

ఇక్కడ 'దా' ఏవార్థ కాన్ని సూచిస్తున్నది. అలాగే

3. 2. పదం తమిళం, ప్రత్యయం తెలుగు :

పూడ్సినాడు (పూడ్సు-ఇనా-డు)

3. 3. -వందు తమిళ వ్యవహార ప్రయోగం. దీని ప్రభావంవల్ల చిత్తూరు జిల్లా ప్రజలుగూడా తమ వాడుకభాషలో దీన్ని ఎక్కువసార్లుచొప్పించటం అలవాటు చేసుకున్నారు.

ఉదా : 'సివిల్ కేసెస్ వచ్చి నేను చూస్తాను'

ఇదే తమిళ వ్యవహారంలో అయితే ఇలా ఉంటుంది.

'సివిల్ కేసెస్ వందు నాన్ పార్పేన్'

4. ఈ జిల్లాలో సామాన్యంగా ఇటువంటి ప్రయోగాలు వినపడ్తూ ఉంటాయి.

| | | |
|---|---|---|
| హైద్రాబాద్ పోతానే | 'హైద్రాబాద్ పోగానే' | అనే అర్థంలో |
| ఎరువు తోల్తానే | ఎరువు తోలగానే | ,, |
| ఎమ్. ఎ చేస్తానే | ఎమ్. ఎ చేయగానే | ,, |
| తెల్లవార్తానే | తెల్లవారగానే | ,, |

5. అలాగే ఇక్కడ

బస్సు దిగిందే కాలేజీ 'బస్సు దిగగానే ఎదురుగానే (చాలా సమీపంలో) కాలేజీ ఉంది అనే అర్థంతో.

ఈవినింగ్ వచ్చిందే అన్నం తింటాం

సాయంత్రం ఇంటికి రాగానే అన్నం తింటాం అనే అర్థంతో వీరు వ్యవహారిస్తూ ఉంటారు.

6. ఈ కింది వాక్యాల్లో 'నిలుచ్' క్రియ 'ఆగు' 'మాను', 'ఉండు' అనే అర్థాలతో వాడుతూ ఉంటారు.

ఉదా॥ చదువు నిలిపేసినాడు 'చదువు ఆపేడు'
సేద్దెగాడు నిలిచిపోయినాడు 'జీతగాడు పని మానేసేడు'
పెళ్ళిగాకుండా నిలిచిపోయింది 'పెళ్ళిగాకుండా ఉండిపోయింది'

7. ఇదే విధంగా 'ఎత్తు' క్రియ 'తీయు' 'కొను' అనేఅర్థాలతో వ్యవహారిస్తూ ఉంటారు.

ఉదా॥ నగలు ఎత్తుకొనిపోతే - నగలు తీసుకొనిపోతే
పుస్తకం ఎత్తినాడు - పుస్తకం కొన్నాడు
జెండాఎత్తుకొనివస్తాడు - జెండా తీసుకొని వస్తాడు.

ఈ విధంగా పై లక్షణాలు ఈ జిల్లామాండలికంలో చోటుచేసుకున్నాయి.

## IV

## చిత్తూరు మాండలికం - ఆధునిక తెలుగు ప్రామాణిక భాష

ఆధునిక తెలుగు భాషను భాషాశాస్త్ర దృష్ట్యా నాలుగు ప్రాంతీయ మాండలికాలుగా స్థూలంగా విభజించటం జరిగింది. 1) కోస్తా 2) కళింగ 3) రాయలసీమ 4) తెలంగాణా. చిత్తూరుజిల్లా రాయలసీమ ప్రాంతీయ మాండలికానికి చెందినది. కోస్తా జిల్లాలోని విద్యావంతుల వ్యావహారిక భాషను ఆధునిక తెలుగు ప్రామాణిక భాషగా భాషాశాస్త్రవేత్తలు భావిస్తున్నారు. ప్రామాణిక భాషకు, చిత్తూరు జిల్లా మాండలిక భాషకు మధ్యగల సామ్య, వైవిధ్యాలను స్థూలంగా పక్క పేజీలో ఇవ్వబడిన పట్టికలో పరిశీలిద్దాం.

| అంశం | ఆధునిక ప్రామాణిక భాష | చిత్తూరు మాండలికం (శిష్టులు) | చిత్తూరు మాండలికం (శిష్టేతరులు) | కోస్తా (గుంటూరు) శిష్టేతరులు |
|---|---|---|---|---|
| *1. వర్ణ నిర్మాణ విభాగం :* | | | | |
| అచ్చులు | ఏ | ఏ | — | — |
| హల్లులు | చ | చ | స(చ తక్కువ) | స(చ తక్కువ |
| | నణ | నణ | న | న |
| | లళ | లళ | ల(ళ తక్కువ) | ల(ళ తక్కువ) |
| మహాప్రాణ ధ్వనులు | ఉన్నాయి | ఉన్నాయి | చాలా తక్కువ | చాలా తక్కువ |
| *2 పదాంశ విభాగం* | | | | |
| *నామ విభాగం :* | | | | |
| బహువచనం | లు ( ళు) | లు ( ళు) | లు (ళు చాలా తక్కువ) | లు(ళు చాలా తక్కువ) |
| నామ ప్రత్యయాలు | —బట్టి | -బట్టి | -బంటి | — |
| | మధ్య | సందు/మధ్య | సందు/మద్దె | మద్దె |
| | లోపల | లోపల | లోపు | లోన |
| | పూట | — | -ఆల | -ఆల |
| తాలవ్యీకరణాలు & సమీకరణాలు | సచ్చెం | సచ్చెం | సత్తెం | సత్తెం |
| | మజ్జె | మజ్జె | మద్దె | మద్దె |
| | — | సేజ్జెం | సేద్దెం | — |
| | విజ్జె | విజ్జె | — | — |
| | లగ్నం | లగ్నం | లగ్గం | లగ్గం |
| | ఇస్తారు | ఇస్తారు | ఇత్తారు | ఇత్తరు |
| వర్ణమార్పులు | అప్పడం | అప్పళం | అప్పళం | అప్పడం |
| | అబ్బాయి | అబ్బాయి | అబ్బాయ | అబ్బాయ |
| | మగ్గం | మగ్గం | మొగ్గం | మగ్గం |
| | రాత్రి | రాత్రి | రేత్రి | రేత్రి |
| | అడుగు | అడగు | అడగు | అడుగు |

| అంశం | ఆధునిక ప్రామాణిక భాష | చిత్తూరు మాండలికం (శిష్టులు) | చిత్తూరు మాండలికం (శిష్టేతరులు) | కోస్తా (గుంటూరు) (శిష్టేతరులు) |
|---|---|---|---|---|
| సంఖ్యలు | పదిహేను<br>రెండొందలు<br>మూడొందలు<br>పంధొమ్మి-దొందలు | పదహైదు<br>ఇన్నూరు<br>మున్నూరు<br>పంధొమ్మి-దొందలు/<br>వెయిన్ని తొమ్మనూరు | పదైదు<br>ఇన్నూరు<br>మున్నూరు<br>వెయిన్నితొ-మ్మనూరు | పదేను<br>రొండొందలు<br>మూడొందలు<br>పందొమ్మి-దొందలు |
| -మంది | ఎడుగురు-తర్వాత | నలుగురు-తర్వాత | నలుగురు-తర్వాత | ఏడుగురు-తర్వాత |
| భావార్థక ప్రత్యయం | - అటం | - అటం/పది | - పది | -అటం |
| **3. క్రియావిభాగం** | | | | |
| భూతకాలిక ప్రత్యయాలు | | | | |
| ఉత్తమ/మధ్యమ పురుష | ఏ/నా(న- | ఏ/ఇనా/నే(న- | ఇనా/నే(న- | -ఇన/న(న- |
| ప్రథమ ఏక — మహత్ | ఏ/నా | ఏ/నా;ఇనా/నే(న- | ఇనా/నే(న- | ఇన్ |
| ప్రథమ ఏక — మహదితర | ఇన్/న | ఇన్/న | ఇన్ | ఇన్ |
| బహు — మానవ | ఏ/నా | ఏ/నా;ఇనా/నే(న- | ఇనా/నే(న- | ఇన |
| బహు — మానవేతర | ఇన/న | ఇన/నే(న- | ఇన | ఇన |
| తద్ధర్మార్థకం | | | | |
| ఉత్తమ/మధ్యమ పురుష | -తా-/-టా- | -తా-/-టా- | -తా-/టా- | -త-/-ట- |
| ప్రథమ ఏక — మహత్ | -తా-/-టా- | -తా-/టా- | -తా-/టా- | -త-/-ట- |
| ప్రథమ ఏక — మహదితర | -తున్-/టున్ | తున్/టున్;-తా-/-టా | -తా-/-టా | -త-/-ట- |

| అంశం | ఆధునిక ప్రామాణిక భాష | చిత్తూరు మాండలికం (శిష్టులు) | చిత్తూరు మాండలికం (శిష్టేతరులు) | కోస్తా (గుంటూరు) (శిష్టేతరులు) |
|---|---|---|---|---|
| బహు మానవ | -తా-/-టా- | -తా-/-టా- | -తా-/-టా- | -త-/-ట |
| బహు మానవేతర | -త-/-ట- | -తా-/-టా- | -తా-/-టా- | -త-/-ట |
| వర్తమానకాలిక ప్రత్యయం | | | | |
| ఉత్తమ/మధ్యమ పురుష | -త-/-ట-+ ఉండు | -త-/-ట-+ ఉండు | -త-/-ట-+ ఉండు | -త-/-ట-+ ఉండు |
| ప్రథమ మహత్ | -తున్నా-/-టున్నా- | తున్నా/టున్నా; తుండా/టుండా | -తుండా-/-టుండా- | -తున్-/-టున్- |
| ప్రథమ మహదితర | -తున్న-/-టున్న- | -తున్న-/-టున్న-; తాన్-/-టాన్;-తుండా/-తండా; | -తాన్-/-టాన్ -తుండా-/-టుండా- | -తున్-/-టున్- |
| సామర్థ్యార్థకం | తుమర్థకం+గల | తుమర్థకం+గల/గలగు, తద్ధర్మార్థక రూపం | తద్ధర్మార్థక రూపం | తద్ధర్మార్థక రూపం |
| నిశ్చయార్థకం | -ఆలి | -ఆల/-వాల/-ఆలి | -ఆల | -ఆల |
| శత్రర్థకం | -తూ-/-టూ- | -తా-/-టా; తూ/టూ | -తా/-టా- | -తా-/-టా- |
| తద్ధర్మ విశేషణం | -ఏ- | -ఏ- | -ఏ- | -ఏ- |
| చేదర్థకం | -తే-/-టే- | -తే-/-టే | -తే-/-టే- | -తే-/-టే |
| ఉభయ- ప్రార్థనాద్యర్థకం | -దామ్ | -దామ్/-తామ్ | -తామ్ | -దామ్ |
| క్త్వార్థకం | ఇ- | -ఇ- | -ఇ- | -ఇ- |

| అంశం | ఆధునిక ప్రామాణిక భాష | చిత్తూరు మాండలికం (శిష్టులు) | చిత్తూరు మాండలికం (శిష్టేతరులు) | కోస్తా (గుంటూరు) (శిష్టేతరులు) |
|---|---|---|---|---|
| అప్యర్థకం | -ఇనా/-నా | ఇనా/-నా, తే/ చే + కూడా | -ఇనా/-నా-, తే/చే + కూడా | -ఇనా/నా- |
| తుమర్థకం | -అ- | -అ- | -అ- | -అ- |
| క్త్వార్థకం | -ఇన- | -ఇన- | -ఇన- | -ఇన- |
| క్రియలమీద విభక్తి ప్రత్యయాలు | తరవాత | తరవాత-/-నాక | -నాక /-నంక | -నాక |
| | -సరికి | -సరికి | -కాడికి | -తలికి-కాడికి |
| సంబోధ-నార్థకాలు | (అ) రేయి | (అ) డేయి | డేయి, ఏంబా | రేయి,ఏవయ్యా |
| | ఏమండీ ఏమయ్యా | ఏమండీ ఏమయ్యా, సామీ | ఏమప్పా/సామీయో, ఏమ్మా | ఏమండి ఏరా, |

V

## పదజాలం

మాండలికాలు సాధారణంగా తమ ప్రత్యేక పదజాలం ద్వారా తమ తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకొంటూ ఉంటాయి. ప్రాంతీయ మాండలికాలు (Regional dialects) మామూలుగా వ్యాకరణ విశేషాలవల్లనే గాక, ఉపయోగించే పదాల వల్ల కూడా ఇతర మాండలికాల్తో విభేదిస్తూ ఉంటాయి. చిత్తూరు జిల్లా రాయలసీమ ప్రాంతీయ మాండలికానికి చెందినది కాబట్టి సామాన్యంగా రాయలసీమ పలుకుబడులు ఉంటాయి. నైసర్గికంగా తమిళ భాషా ప్రాంతం చేరువలో ఉండటంవల్ల తమిళ పదాలు, ప్రయోగాలు విరివిగా ఉంటాయి. ఇవన్నీగాక చిత్తూరు జిల్లా వ్యావహారిక భాషలో కావ్యభాషారూపాలు చాలా కనిపిస్తాయి. ఇవి ఈ ప్రాంతం విలక్షణతను తెలియపరుస్తాయి. మచ్చుకు కొన్ని వ్యావహారిక పదాలు వాటి ప్రాచీన రూపాలు, ప్రయోగాలు చూద్దాం.

| కావ్య భాషాపదం | చిత్తూరు వ్యావహారిక రూపం | చిత్తూరు జిల్లాలో దాని అర్థం | కావ్యభాషలో అర్థం |
|---|---|---|---|
| 1. అప్ప | అప్ప | అక్క, తండ్రి | అక్క, తండ్రి |
| "క. అప్పయు బరిజనములు దను దప్పక కనుఁగొనుచునుండ (భార. విరా. ఆ) అప్పయానతి బూని కానలకరిగి (అచ్చ. యు. కాం) | | | |
| 2. ఏమఱించు | ఏమార్చు | మోసగించు | ఏమఱు, ప్రమాదపడు |
| "చ. లవణాసురు మాతులుఁడేమఱించితీ (జై ౭, ఆ) | | | |
| 3. ఒలికి | ఒలికి | శ్మశానం | సొదపేర్చెడుచోటు, శ్మశానం, కాడు |
| "ఎ. గీ. ఊరనుండనొల్లఁ డొలుకులలోఁగాని" (వీర౭, ఆ) | | | |
| 4. ఓలి | ఓలి | వరకట్నం | ఉంకువ(కన్యాశుల్కం) |
| 5. గలబ | గలాభ | గోల, గొడవ | కలత |
| "ద్వి. క్రతు కర్మములకు విఘ్నములు గావించి క్షితిమీఁద గలబలు చేయుఁడెల్లడల" (భాగ. 2. సం) | | | |
| 6. తేరు | తేరు | రథం | రథం |
| 7. దండి | దండి(గ) | సమృద్ధము | సమృద్ధము |
| "ద్వి. రెండడుగులనై ధరిత్రి యుదివియు దండిగాఁ గొలిచి" (రా. బాల. కాం) | | | |
| 8. పెఱుకు | పెరుకు | పీకు | పీకు |
| "విజయలోలుఁడై వాని నాలుక పెర్కిచంపె" (రా. మం. కాం) | | | |
| 9. ప్రొద్దు | పొద్దు | కాలం, పూట, సమయం | కాలం, పూట మొ॥ |
| 10. బిడ్డ | బిడ్డ | కూతురు, శిశువు | కూతురు, శిశువు కొడుకు |

కావ్యభాషా ప్రయోగాలు శబ్దరత్నాకరము (1969 పునర్ముద్రణ) నుంచి సేకరించినవి.

| కావ్య భాషాపదం | చిత్తూరు వ్యావహారిక రూపం | చిత్తూరు జిల్లాలో దాని అర్థం | కావ్యభాషలో అర్థం |
|---|---|---|---|
| 11. మబ్బు | మబ్బు | చీకటి | మేఘము, చీకటి |

"ఉ. ఘనాఘనముల్ పొగరెక్కి కేవలాంధ: కరణంబులై బహు
విధంబుల మబ్బులగోల్పుఁగంటివే" (రామా. ఆ.)

| | | | |
|---|---|---|---|
| 12. రంపె(లాఁడి) | రంపు | తగాదా, పేచీ | రాక్షసకృత్యములు |

"సీ. చించివై చుచేకాన చీరలిచ్చినఁగుటీ
రమునఁగై సేపుదారంపెలాఁడీ" (పంచ. వేం. 3, ఆ.)

ఈ రకంగా ప్రాచీన రూపాలు పుష్కలంగా చిత్తూరుజిల్లా వ్యవహారిక భాషలో కనిపిస్తాయి. ఈ మాండలికాన్ని ప్రతిబింబించే కొన్ని మాండలిక పదాలు కూడా మచ్చుకు కొన్ని చూడండి.

| చిత్తూరు మాండలికం | ప్రామాణిక భాషాపదం |
|---|---|
| అడమానం | తాకట్టు |
| అయ్యవారు | మాష్టారు, ఉపాధ్యాయుడు |
| ఎనుములు | గేదెలు/బర్రెలు |
| కట్టెకాయ | చింతకాయ |
| కసువు | గడ్డి |
| కొయ్య | చెక్క |
| తక్కాలి | రామ్ములగ |
| తేరు | రథం |
| దండిగ | బాగా/చాలా |
| దుడ్డు | డబ్బు |
| బద్దెపిల్ల | మేకపిల్ల |
| మడి/బురదకయ్య | వరిపొలం |
| మబ్బు | చీకటి |
| మోడం | వానముసురు |
| మూట | బస్తా |

| చిత్తూరు మాండలికం | ప్రామాణిక భాషాపదం |
|---|---|
| సెలవు | ఖర్చు |
| ఏమార్చు | మోసగించు |
| ఒలి | కట్నం |
| కపిల | యాతం |
| కాలు, ముక్కాలు | పావు, ముప్పావు |
| కాలుముడి | మూత్రవిసర్జన |
| కిస్తి | వాయిదా |
| మడక | నాగలి |
| ఖాయిలాపడు | జ్వరపడు |
| జల్లు | తాలు |
| జీవాలు | పశువులు |
| తూర్లు | సార్లు |
| దినాలు | రోజులు |
| దండిగ | పూర్తి(గా) |
| పిలకాయలు | పిల్లలు |
| వరుమానం | జీతం |
| వరంబుడి | ఆదాయం |
| సంబంధి | వియ్యంకుడు/వియ్యపురాలు |

ఈ విధముగా చిత్తూరు జిల్లా తెలుగును ఆధునిక తెలుగు ప్రామాణిక భాషలో స్థూలంగా పోల్చి పరిశీలించినప్పుడు సామ్య వైవిధ్యాలు కనిపిస్తున్నాయి.

చిత్తూరు మాండలిక వ్యవహారంలోని వివిధ భాషావిషయాలు పై పేజీల్లో క్లుప్తంగా చర్చించాం. ఆధునిక తెలుగు ప్రామాణిక భాషాప్రభావం ఈ జిల్లాలోని శిష్టుల వ్యావహారికంలో కనిపిస్తున్నది. వీరు ప్రాంతీయ ప్రయోగాల్తోపాటు ప్రామాణిక భాషను గూడా సొంతం చేసుకొని ఉపయోగిస్తు న్నట్లు తెలుస్తున్నది. వీరి భాషలో తమిళభాషా, తమిళ ప్రజల ప్రభావం సహజంగానే ఎక్కువగా ఉన్నట్లనిపిస్తుంది. ప్రాచీన భాషా ప్రయోగాలు ఎన్నో చిత్తూరు జిల్లా వ్యవహారికంలో జీవిస్తున్నాయి. చిత్తూరుజిల్లా మాండలిక భాష వీరి సంస్కృతిని ప్రతిబింబిస్తూ ఉంది.

# 4

# చిత్తూరు-వరంగల్ జిల్లాల మాండలికాలు

- శ్రీ పులిగడ్డ శివానందశర్మ

చిత్తూరు, వరంగల్ జిల్లాల్లో వాడుకలో ఉన్న తెలుగు భాషలోఉన్న భిన్న, సామాన్య లక్షణాలను పరిశీలించటం ఈ వ్యాస ముఖ్యోద్దేశం అయితే కొంతలోకొంత ఈ రెండు జిల్లాల భాషనూ ఆధునిక ప్రమాణ భాషగా భావిస్తున్న గుంటూరు-కృష్ణా జిల్లాల ప్రాంతంలోని భాషతో పోల్చిచూడటంగూడా జరుగుతుంది.

వరంగల్లూ, చిత్తూరూ, గుంటూరు-కృష్ణా జిల్లాలు వరసగా తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతాలకు చెందినవి. ఈ మూడూ మూడు భిన్న మాండలికాలకు సంబంధించినవే అయినా ప్రతి రెండు మాండలికాల్లోనూ కొన్ని సామ్యాలు ఉండటం కద్దు. పైగా ప్రామాణిక భాషా లక్షణాలు మిగతా రెండు ప్రాంతాల భాషల్లోనూ అధికంగా ఉంటయ్యనేది ఒక భావన. ఈ భావన ఎంత సమంజసమైనదో కూడా పరిశీలిద్దాం.

1. భావార్థక రూపం తద్ధర్మార్థక క్రియావిశేషణం మీద-ది ప్రత్యయం చేరటంవల్ల ఏర్పడుతుంది.

ఉదా॥ సివిల్ కేస్లో కొట్టుకొనే దుండదు.
పెళ్ళిజేస్కొని ప్రేమించేదే మంచిది.

[వరంగల్‌లో ధాతువుమీద-ఉడు ప్రత్యయం చేరడంవల్ల ఈ రూపం ఏర్పడుతుంది. → తాగుడు. ఒచ్చుడు, చేసుడు

[ప్రా.భా. *లో రూపాలు - కొట్టటం, ప్రేమించడం, తాగటం, రావడం.]

2. నిశ్చయార్థక రూపం తుమర్థరూపంమీద - ఆల ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడుతుంది.

ఉదా॥ నచ్చాల, పోవాల, ఇయ్యాల, చేపిచ్చాల

[వరంగల్‌లో-ఆలె ప్రత్యయ వాడ్తారు.→దిగాలె, చేయాలె, తెల్సోస్కర-వాలె.

ప్రా. భా. లో రూపాలు-నచ్చాలి, దిగాలి, పోవాలి, చెయ్యాలి.]

---

* ప్రా. భా = ప్రామాణిక భాష.

3. భూతకాలబోధక క్రియారూపాలు ధాతువుమీద - ఇనా ప్రత్యయంచేరి ఆపైన పురుషప్రత్యయం చేరటంవల్ల ఏర్పడతాయి.

ఉదా॥ పెట్టినారు, నాటించినారు, నిలిపేసినాడు, చూపించినావు.

(గమనిక : ప్రథమపురుష మహదితర ఏకవచన రూపాల్లో మాత్రం -ఇన్- ప్రత్యయం చేరుతుంది.)

[వరంగల్‌లో మధ్యమపురుష బహువచన, ప్రథమపురుష రూపాల్లో (మానవేతర బహువచనంలో తప్ప) -ఇన్ ప్రత్యయం చేరుతుంది. → చేసిండు, రాసిన్రు, చూసింది. ఇతరత్రా - ఇన ప్రత్యయం చేరుతుంది. → వెళ్ళిన, చెప్పినవ్, వచ్చినయ్, పోయినం

ప్రా.భా. లో రూపాలు- పెట్టేను, చేసేవు, రాసేడు, చెప్పింది.]

(క) ఉన్-/-ఉండ్- ధాతువు విషయంలో - ఇక్కడి రూపాలు ఉండ్- ధాతువుమీద - ఆ ప్రత్యయంతో ఏర్పడతాయి.

ఉదా॥ ఉండాను, ఉండావు, ఉండాడు, ఉండారు.

(గమనిక : ఉన్- ధాతువుతో ఏర్పడే రూపాలు ఇక్కడ తక్కువ)

ప్రథమపురుష మహదితర ఏకవచన రూపాలుగా ఉండ్-ధాతువుకు సంబంధించి ఉండింది, ఉండాది అనే రెండూ ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

[వరంగల్‌లో ఉన్-ధాతువుమీద -న ప్రత్యయంతో ఏర్పడతాయి. → ఉన్న(ను), ఉన్నవ్, ఉన్నరు, ఉన్నది.

ప్రామాణిక భాషలో రూపాలు - ఉన్నాను, ఉన్నావు, ఉన్నారు, ఉన్నది.]

(గ) నకారాంత ధాతువులమీద -నా/-న లతోపాటు - నే ప్రత్యయంతో ఉన్న రూపాలుకూడా ఈ మాండలికంలో అవుపిస్తాయి.

ఉదా॥ తీసుకొన్నాడు, తీరుకొక్కన్నం

కొట్టుకొన్నేరు, ఒప్పుకొన్నేడు

నకారాంతేతర ధాతువులమీద ఈ ప్రత్యయం చేరటం చాలా అరుదుగా కనబడుతుంది.

ఉదా॥ వాడ్‌నేరు

4. ఉభయ ప్రార్థనార్థక ప్రత్యయాలుగా ఇక్కడ -తాం, -దాం రెండూ వాడుకలో ఉన్నాయి.

ఉదా॥ ఏదో గలాట్ చేస్తామని...

చేస్కుందాం,

[వరంగల్‌లో కూడా ఈ రెండు ప్రత్యయాలూ ఉన్నాయి. → దేవాలయం చూస్తామని పోయ్నాము, మెద్రాసుచ్చద్దామని...

ప్రా. భా లో. రూపాలు - చేద్దాం, చూద్దాం, పోదాం.]

5. క్రియాప్రతిపాదిత చర్య పూర్తి అయిన - 'వెను వెంటనే' అనే భావాన్ని శత్రర్థక కృదంత విశేషణం మీద - ఏవార్థక ప్రత్యయం చేర్చటం ద్వారా సాధిస్తారు.

ఉదా॥ అవరై పోతానే. ప్రెజెంటేసొస్కొంటానే, తోల్తానే.

[వరంగల్‌లో -అంగనే/-అంగానే ప్రత్యయం తుమర్థ రూపంమీద చేరి పీటికి సమమైన రూపాలేర్పడతాయి. → పోంగనే, చెయ్యంగానే.

ప్రా.భా.లో రూపాలు - పోగానే, తోలగానే, చెయ్యగానే.]

6. చేదర్థ రూపసాధనకు "-తే"తో వచ్చేరూపాలతోపాటు భూతకాలిక రూపానికి - "అంటే" చేరుస్తారు. ఒకొక్కప్పుడు భూతకాలిక రూపానికి "-ఓ" చేర్చటంకూడా జరుగుతుంది.

ఉదా॥ పోయినామంటే,...

తోల్నేమో... డబ్బుగాని ఉన్నాదంటే...

చేసినామంటే...

[వరంగల్‌లో -తె ప్రత్యయం ధాతువుమీద చేరుతుంది. → కడ్తే, కష్టపడ్తేస్తే, ఇస్తే. చిత్తూరు రూపాలు చాలా అరుదుగా కనపడ్తయ్, పెండేస్నేమంటే...

ప్రా.భా.లో రూపాలు-పోతే, ఉంటే, చేస్తే.]

7. వ్యతిరేక చేదర్థక ప్రత్యయంగా "-అకపోతే" ఇక్కడ వాడుకలో ఉంది.

ఉదా॥ తీసోక్కకపోతే...

ఇవ్వకపోతే...

[వరంగల్‌లో -అకుంటే ప్రత్యయం వాడ్తారు. → నిజం బట్టయ పెట్టకుంటె, ఇయ్యకుంటె.

ప్రా.భా.లో రూపాలు - తీసోక్కకపోతే, ఇయ్యకపోతే.]

8. అప్యర్థక రూపాలు ప్రా.భా.లోని చేదర్థక రూపాలమీద(చూ.పై 6) "గూడా" చేరి ఏర్పడతాయి.

ఉదా॥ నా ఇన్నేళ్ళ సర్వీస్లో చూసొంటే గూడా...

ఆదాయ మొస్తేగూడా...

చదివ్తే గూడా...

ఒకొక్కప్పుడిది ప్రా. భా. లోని అప్యర్థక రూపాలమీద '-గూడా' చేరి ఏర్పడతాయి,

ఉదా॥ తప్పు చేస్నాగూడా...

[వరంగల్‌లో - ఇనా/ ప్రత్యయ ధాతువుమీద చేరటం వల్లనూ, అది చేరినమీదట -గాని, -గూడ ల్లో ఏదైనా అదనంగా చేరటం వల్లనూ

ఏర్పడతాయి → కాపాడినా, పంపిచ్చినాగాని, కొట్టిచ్చాన్నగూడ.

[ప్రా. భా.లో రూపాలు-చేసుకున్నా, ఒచ్చినా, చదివినా, పంపిచ్చినా.]

9. ఆత్మార్థక ప్రత్యయంగా ఇక్కడి భాషలో ధాతువుమీద - కొన్ ఉంది.

ఉదా : పట్టుకొంటారు తీస్కొంటాము
చదువుకొన్నవాళ్ళు చదువుకొన్నెంక...

[వరంగల్‌లో-కున్ ప్రత్యయం వస్తుంది. → చేర్చుకునేవారు, తీస్కునే వారము, విరమించుకున్న.

ప్రా. భా. లో రూపాలు – పట్టుకుంటారు, చదువుకున్నవాళ్ళు, తీసుకునే వాళ్ళం.]

10. నిషేధార్థక ప్రత్యయంగా తుమర్థరూపం మీద - కూడదు ప్రత్యయం వాడ్తారు.

ఉదా : తీసోకకూడ్దు
రా కూడదు

[వరంగల్‌లో –వద్దు ప్రత్యయం వాడుకలో ఉంది. → అందుకే మనం విడోవ్వద్దు, ఆ అన్నకున్నా వోదినె కెవ్వరిక్కైలవద్దాయె.

ప్రా. భా. లో రూపాలు - తీసోకకూడదు, విడిపోకూడదు.]

11. వ్యతిరేక వర్తమాన క్రియారూపం ప్రా. భా. లో ఉన్నరూపంతో సమంగా ఉంటుంది. ఈ రూపంతోపాటు ఇక్కడి భావార్థకం మీద –లే, - లేదు చేర్చటంవల్లఏర్పడే రూపం కూడావాడుకలో ఉంది.

**ఉదా :** జీర్ణానికి ఒచ్చేదిలే.
ఇప్పుడేం అనేదిలే.
ఆలోచించేదే లేదు.

[వరంగల్‌లో వర్తమాన కృదంత విశేషణం మీద - లే ప్రత్యయం పురుషప్రత్యయంతో చేరి ఈ రూపాలు ఏర్పడతాయి → దొర్కలేవు, బాగ చేస్తలేరు, ఎక్కువ్వంట దీస్తలేం.

ప్రా. భా. లో రూపాలు-రావటంలేదు, ఆలోచించటంలేదు, దొరకటం లేదు.]

12. అవధ్యర్థక ప్రత్యయాలుగా-వరకు,-దాకా అనేవి ఉపయోగిస్తారు.

ఉదా : ఎస్సెల్సీ వర్కు
ఒచ్చేదాకా

[వరంగల్‌లో – దాక,-దన్క అనేవి ఉపయోగిస్తారు→ ఒంటిగంటదాక, చెప్పేదన్క.

ప్రా. భా. లో రూపాలు - ఎస్సెల్సీ వరకూ, చెప్పేదాకా.]

13. అనంతర్యార్థక ప్రత్యయాలుగా భూతకాలిక క్రియావిశేషణంమీద అంక గా - ఎంక, - ఆక గా ఏక చేరుస్తారు. (-అంక, - ఆక లే ఎక్కువ వాడతారు.)

ఉదా : చేస్నంక చదువుకొన్నెంక
దున్నినాక ఎరువు దాల్నేక

[వరంగల్‌లో - అంక ప్రత్యయం తరచుగా వాడ్తారు → కోలువోబ్య్నంక, దాన్మీద రాస్నంక, ఆ బిల్లు యిచ్చినంక.

ప్రా. భా. లో రూపాలు—చేసిన తరవాత, రాసిన తరవాత, ఇటువంటి రూపాలు కూడా చిత్తూరు, వరంగల్ మాండలికాల్లో లేకపోలేదు.]

14. 'సమయానికి' అనే అర్థం రావడానికి - తలికి, - కాడికి అనే అనుబంధాలు తద్ధర్మార్థక క్రియా విశేషణం మీద చేరుస్తారు.

ఉదా : అవపడకపోయ్యే తలికి...బోటనేలకాడ ముట్టేకాడికి...
అయ్యేతలికి... కన్నువాసే కాడికి....
ఒచ్చేతలికి... చెప్పేకాడికే– ...

[వరంగల్‌లో-వరకు వాడ్తారు → గుడెపాడుకొచ్చే వరకు, చెప్పేవర్కు -తలికి వాడిన రూపాలు చాలా అరుదు → అవ్వత్తల్కె.

ప్రా. భా. లో రూపాలు - అయ్యేటప్పటికి / అయ్యేసరికి, ఒచేటప్పటికి / ఒచ్చేసరికి.]

15. సామ్యార్థకంగా - మాదిరి అనుబంధం వాడతారు.

ఉదా : స్రీదేవ్ మాదిరి హరిజెన్లు మాద్రి
వాళ్ళమాద్రి ఈ మాదిరి

(వరంగల్‌లో - లాగా అనే అనుబంధం ఉపయోగిస్తారు→రంద్రాల్లాగా బొమ్మలాగా.

ప్రా. భా. లో రూపాలు - వాళ్ళలాగా, స్రీదేవిలాగా, బొమ్మలాగా.]

16. ఉపర్యర్థంలో ఇక్కడ-పైన అనే అనుబంధం చేరుస్తారు.

ఉదా : చెంపపైన నడింపైన

[వరంగల్‌లో - పై అనే అనుబంధాన్ని వాడతారు → క్రుళ్ళెయ్, గుట్టపై ప్రా. భా. లో రూపాలు - చెంపమీద, గుట్టమీద.]

(గమనిక:– మీద అనుబంధం మూడు ప్రాంతాల్లోనూ ఉంది)

17. నిమిత్తార్థంలో - కోసరం, కోసం అనే అనుబంధాలు ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

ఉదా : అందుకోసరం లోను కోసం
సాల్వ జేయటానికి కోసరం వసతుల కోసం
తీర్పు కోసరం పీటి కోసం

[వరంగల్‌లో - కొరకు, - కోసం అనే అనుబంధాలు వాడ్తారు → ఉజ్జోగం కొర్కు, ప్యాచర్కోసం.

[ప్రా. భా. లో రూపాలు – దానికోసం, ఉజ్జోగం కోసం.]

18. సంబంధ బోధకానుబంధంగా అప్పుడప్పుడు – యొక్క ఉపయోగిస్తారు.

ఉదా : నా యొక్క ఒపీనియన్
వాళ్ళయొక్క...

(వరంగల్‌లో కూడా అప్పుడప్పుడు ఈ-యొక్క వాడకం అలవాటులో ఉంది → నా యొక్క ఆనుబవం, వాండ్లయొక్క...

[ప్రా. భా. లో – యొక్క అంతగా ఉపయోగించరు.)

19. తృతీయా విభక్తిలో – తోటి, – చేత అనే అనుబంధాలు వాడతారు.

ఉదా : ఉద్దేసెంతోటి...
ఇతన్నే చేసోక్కవాలన్న ఉదేసెం చేత...

(వరంగల్‌లో – తోటి, – తోని అనే అనుబంధాలు వాడతారు → నాల్కతోటి, మూల్లచ్చ్రలూ పాయల్తోని-

[ప్రా. భా. లో రూపాలు- ఉదేసెంతో, నాల్కతో).

20. పంచమీ విభక్త్యర్థంలో – నుంచి, నుంటి, – నుండి అనుబంధాలు ఇక్కడి వాడుకలో ఉన్నాయి.

ఉదా : ఇంట కాడనుంచి చెంబకూడు అని [గ్రామం నుండి-
వెయిన్ని తొమ్మనూట యాభై తొమ్మిది నుంటి-

(వరంగల్‌లో – నించి, – నుంచి, – నుండి, – నించెల్లి, – కెల్లి, – గాలె అనుబంధాలు వాడుకలో ఉన్నాయి → ఇక్కన్నించి, కొద్దికాలం నుంచి, అక్కన్నుండి, ఆన్నించెల్లి, నవాపోయిన్కాడ్కెలి, అకడెక్కల్లి, మొదల్గాలె.

[ప్రా భా లో రూపాలు – ఇక్కణించి, ఇంటినుంచి, పక్కనుండి)

21. అభ్యంతరార్థంలో – లో ప్రత్యయం చేరుస్తారు

ఉదా : పల్లెటూరో — స్వాధీనంలో
సినిమా టాకీస్లో — సివిల్ కేస్లో

(వరంగల్‌లో – ల, – లో, – లోపట అనేవి వాడ్తారు → ఇంట్ల, దాన్ల, ఎజ్జుకేషన్లో, గేమ్సలో, స్కూల్లోపట్నే, ఇంటర్మీడెట్లోప్ట

[ప్రా భా లో రూపాలు – పల్లెటూళ్లో, ఇంటో, స్కూల్లో)

22. స్పష్టార్థంలో ఈ కింది సందర్భాల్లో – అంతా అనే అనుబంధాన్ని వాడతారు

ఉదా : ఒకటిన్నర కంతా...
ఇరై వ్వదినాల కంతా...
మూడోనెలకంతా...

వరంగల్‌లో అల్లా వాడ్తారు → ఒంటిగంటకల్లా –

[ప్రా భా లో రూపాలు – ఒకటిన్నర కల్లా – ఒంటిగంట కల్లా)

23. 'నిష్కారణంగా, ఉద్దేశరహితంగా' అనే అర్థాలు రావటానికి వాక్యాల్లో 'ఏదో' అనే పదాన్ని ఉపయోగిస్తారు

ఉదా : ఏదో గలాటా చేస్తామని -
ఏదో లేడీస్ నట్ల మాస్తారు -
మే మేదో క్లాస్కు పోతాం

(వరంగల్‌లో 'ఏదో' అనే పదమే ప్రయోగిస్తారు → ఏదో గజ్జెజెబ్బ, ఏదో కటినమయ్న లెక్కలు ముందు జెయ్యాలె

ప్రా. భా లో రూపాలు - ఊరికే గలాట్ చేద్దామని, - ఊరికే గస్చేస్చెస్తా)

24. 'ఒచ్చి / వచ్చి' అనే శూన్యపదాంశాన్ని వాడే అలవాటు ఈ మాండలికంలో ఉంది

ఉదా : మా ఫాదరొచ్చి వెవసాయం జేస్తుంటారు
సినిమాటాకీస్లో వచ్చి ఒక తర్టీతౌజండ్స్‌దాకా ఱెక్స్ వస్తుంది
ఒకయకరా కొచ్చీసి

(వరంగల్‌లో గానీ, ప్రా. భా లో గానీ ఈ అలవాటు లేదు)

25. కర్త, క్రియల మధ్య 'వచన' అన్వయం కుదరని వాక్యాలు ఇక్కడి వ్యవహారంలో ఉన్నాయి

ఉదా : ఉజ్జోగాల్ లేదు గాబట్టి
ప్రాబ్లమ్సేమీ ఉండదు
కులమత భేదాలు లేదు
బాధలొస్తూ ఉంటుంది

(ఈ లాంటి వాక్యాలు కూడా వరంగల్, ప్రా. భా లలో కానరావు)

26. ద్వితీయా, చతుర్థీ విభక్తి ప్రత్యయాల లోపం అక్కడక్కడ కనబడుతుంది

ఉదా : ద్వితీయా విభక్తి - పిల్లల్ జూసేది
పోలేరమ్మ నిలబెడ్తారు
చతుర్థీ విభక్తి - కాలేజీపోతాము
ముందు కైరక్టర్ ప్రాధాన్యతిస్తారు
ఇంజనీరింగ్ బోవాలని
అబ్బాయి ఉద్దేసెము

27. మరొక (చూ 24) శూన్యపదాంశం 'గానీ / గాని' అనేది ఇక్కడ వాడుకలో ఉంది

ఉదా : క్లాస్ గానీ లేకపోతే -
డబ్బుగాని ఉన్నాదంటే -
ఆయన గాని లేపోతే -

(వరంగల్‌లో - గన్క వాడ్తారు → ఇంటర్మీడెట్లోప్టా ట్వెంటీఫైవ్ పర్సెంటు గన్కా అని సబ్జక్టుస్‌లో వుండినట్టయితే, ఒక వేల (బొగ్గు) వున్నట్టు గన్కమే...

ప్రా. భా. లో రూపాలు - క్లాస్ గనక లేకపోతే, ఒక వేల (బొగ్గు) గనక ఉంటే.)

28. ఇక్కడ పదాంత 'ము' వర్ణం నిలుపుతారు.

ఉదా : ఉంటాము - ప్రకారము
ఉద్దేసెము - మాత్రము

(వరంగల్‌లో కూడా ఈ అలవాటు ఉన్నది కొంచెం తక్కువగా → చూసినము, మేము, సంవచ్చరము

ప్రా. భా. లో రూపాలు — ఉంటాం, సంవచ్చరం, - ప్రకారం)

29. 'ద్య' లో రెండు వర్ణాలూ సమీకరణం చెంది 'ద్ద' గా ఏర్పడుతుంది.

ఉదా : ఉద్దోగం మద్దెలో

(వరంగల్‌లో 'జ్జ' ఏర్పడుతుంది → ఉజ్జోగం, మజ్జలో

ప్రా. భా. లో రూపాలు - ఉజ్జోగం, పజ్జాలు)

30. ద్వితీయ హ్రస్వాచ్చులోపం ఇక్కడ ఉంది

ఉదా॥ చెర్కు కేవ్లం ఇక్ట

(వరంగల్‌లో ఈ ప్రక్రియ మరింత అధికంగా ఉంది → తర్గతి, కొడ్కు, చిల్క, ఇర్వై

ప్రా. భా లో ఈ లోపం చాలా తక్కువ)

| 31. పదాలు | చిత్తూరు | వరంగల్ |
|---|---|---|
| క్రియలు- | ఎత్తుకున్- (ఉదా॥ అర్థికంగా ఎత్తుకుంటే- అభిప్రాయాని కెత్తుకుంటే- | తీసుకున్- |
| | నిలుపు- (ఉదా॥ మీరింగ నిలిపేయండని | ఆపు- |
| | పట్టు- | పడిబడు |
| | పెరుకు- ఉదా॥ పైరు పెరుక్కొని-) | పీకు |
| | సాకు- | చాదు |
| | తెలీదు | తెలవదు |
| | తే | తే |
| నామాలు- | దినము | రోజు |
| | బిట్టు (ఉదా॥ బిట్కొట్టేదానికిలేదు) | కాపీ |
| | ఎనుము | బర్రె |
| | కాలుముడి / ఒంటేలు | ఒంటేలు |
| | పిలకాయలు | పిలగాండ్లు |
| | గలాట | గడబిడ |

| | | |
|---|---|---|
| | గెనెం | గట్టు |
| సర్వనామాలు-అతను/అతడు | | అతడు |
| సంఖ్యాపదాలు-పదహైదు | | పదిహేను |
| | నూరు | ఒంద |
| విశేషణాలూ అవ్యయాలు | ఆ, ఈ | గా, గీ |
| | అట్ల, ఇట్ల | గట్ల, గిట్ల |
| | నేరుగ | సీదా |
| | బాగా | మంచిగ |

ఇతరాలు- గలీజు (=అసహ్యం),* గెనెం (=గట్టు), జీవాలు (=పశువులు), తగరారు (=తగాదా/పొట్లాట), బద్దె (=మేక), ముట్టు (=కరుస్), మేపు (=మేత) మొ॥వి.

32. పదబంధాలు : వేలంబాడ్తారు (=వేలంవేస్తారు), సినిమాటాకీసు (=సినిమాహాలు) చీలికై పో- (=చీలిపో-) మబ్బు రాత్రి (=చీకటిరాత్రి) మోడంబట్టి (=ముసురుపట్టి) రేపు సంవచ్చరం (=వచ్చే సంవచ్చరం) పంటజేస్కొన్ (=పండించుకొన్) కేసుమోపు (=కేసుపెట్టు) బయింబక్తులు (=భయభక్తులు) బలవంతం పెళ్ళిళ్ళు (=బలవంతపు పెళ్ళిళ్ళు) గోత్రెజీవాలు (=గొర్రెలు) ఆరుమంది (=ఆరుగురు) కొర్విగట్టు దెయ్యాలు (=కొరివిదయ్యాలు) మొ॥వి.

ప్రామాణిక భాషలో ఉన్న క్రియరూపాలు చిత్తూరు వరంగల్ జిల్లాల్లో వాడుకలో ఉన్నాయి వాటితోపాటు సమానార్థకాలుగా మరికొన్ని రూపాలు కూడా ఆయాజిల్లాల్లో ప్రత్యేకంగా ఏర్పడ్డ సందర్భాలు కూడా ఉన్నాయి అదే విధంగా విభక్తి ప్రత్యయాలూ అనుబంధాలూ కూడా ప్రామాణిక భాషలో అమలులో ఉన్న వాటితోపాటు ఆయా మాండలికాలకు విలక్షణమైనవి కూడా ఉన్నాయి. అలాగే చిత్తూరుకు మాత్రమే (రాయలసీమ మాండలికానికి మాత్రమే కావచ్చు) పరిమితమైన ప్రత్యేక పదాలూ పదబంధాలూ కనబడతాయి.

ఇలా ఏ మాండలికానికా మాండలికం భిన్నంగా ఉన్నా, అన్నిటిలోనూ ప్రామాణిక మాండలికం చోటుచేసుకుని ఉన్న కారణంగా భిన్నత్వంలో ఏకత్వం గోచరిస్తున్నది

---

* ఇక్కణ్ణించి కుండలీకరణాలలో ఇచ్చినవి చిత్తూరు పదాలకూ పదబంధాలకూ ప్రా. భా. లో సమానార్థకాలు.

5

# చిత్తూరు-మహబూబ్‌నగర్ జిల్లాల వ్యవహారంలోని కొన్ని భేదాలు

శ్రీ కె. ఆశీర్వాదం

ఆంధ్రరాష్ట్రంలోని జిల్లాల వ్యవహారాన్ని పరిశీలించినట్లైతే ప్రతిజిల్లా వాడుక భాషకూ వివిధ స్థాయిల్లో భేదాలు కనబడ్తాయి ముఖ్యంగా వాక్య గత పదక్రమంలోనూ (Word order), పదాల వాడుకలోనూ (Lexical usage), ఉచ్చారణ రీతుల్లోను (Pronunciation) భేదాలు కన్పిస్తాయి. ఈ భేదాలు జిల్లాలకే పరిమితం కాకుండా తాలూకాలకు, గ్రామాలకు మరి వ్యక్తులకు మధ్యకూడ కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి.

ఈ భేదాలకు కారణాలు అనేకం. వాటిలో ప్రాంతీయత (Regional)' సామాజిక స్తరాలు (Social Strata), విద్య (Education) అనేవి ముఖ్యమైన విగా చెప్పుకోవచ్చు. ఒకే ప్రాంతంలో నివసించే వ్యక్తులమధ్య కన్పించే భేదాలు వారి విద్యా ప్రమాణాన్ని బట్టి, మరి వారి సామాజిక సంబంధాలను బట్టి ఏర్పడవచ్చు. బాగా చదువుకున్న వారికి, పూర్తిగా చదువుకోని వారికి మధ్య పదాల వాడుకలో చాల భేదాలు కన్పిస్తాయి. అంటే ఒకే అర్థంలో భిన్నమైన పదాలు వాడటం గమనించవచ్చు. మహబూబ్‌నగర్ మాండలికంలో వాడే కాల సూచక పదాలు కొన్ని కింద ఉదహరించడమైనది.

| శిష్టవ్యవహారం | శిష్టేతరవ్యవహారం |
|---|---|
| ఉదయం | పొద్దిన్నె |
| మధ్యాహ్నం | అంబటెల్ల |
| సాయంకాలం | పొద్దిమికెల (పగటేల) |
| రాత్రికి | మాపట్క |

ఈ వ్యాసంలో ముఖ్యంగా చిత్తూరు, మహబూబ్‌నగర్ జిల్లాలవ్యవహారంలో కన్పించే కొన్ని భేదాలను దృష్టికి తేవడం జరిగింది. చిత్తూరు తెలుగు నాడులోని దక్షిణ మండలానికి, మహబూబ్‌నగర్ ఉత్తర మండలానికి చెందెన జిల్లాలు.

## వర్ణస్థాయిలో ఉచ్చారణ భేదాలు

(i) *సంయుక్తాలు—అసంయుక్తాలుగా మారడం* (Declusterization) :-
ప్రామాణిక భాషలోని సంయుక్తాలు (clusters) చిత్తూరు, మహబూబ్‌నగర్ వ్యవహారాల్లో వేర్వేరు అసంయుక్తాలుగా మారడం గమనించవచ్చు.

| *సంయుక్తాలు* | *అసంయుక్తాలు* | |
|---|---|---|
| *ప్రామాణికం* | *వ్యావహారికం* | |
| | *చిత్తూరు-మహబూబ్‌నగర్* | |
| న్యాయం | నేయం | నాయం |
| **వ్యాపారం** | వేపారం | యాపారం |
| వ్యవసాయం | వెవసాయం | యవసాయం |
| | (ఎగసం) | (యవుసం) |

పై పదాలలోని /న్యా/వ్యా/లు చిత్తూరు వ్యవహారంలో /నే/వే/లుగా మహబూబ్‌నగర్ వ్యహారంలో నా/యా/లు గా మారడం గమనించవచ్చు.

(ii) /ఆ/ *అచ్చు ఉచ్చారణలో తేడా*:-
చిత్తూరు, మహబూబ్‌నగర్ మాండలిక భేదాలు చాలావరకు రాయలసీమ, తెలంగాణా భేదాలను దృష్టికి తెస్తాయి. ముఖ్యంగా అనునాసిక వర్ణానికి తరువాత ఉన్న /ఆ/ కారం చిత్తూరు భూతకాలంలో /ఏ/ (æ:) మారడం గమనించవచ్చు. అదే వర్ణము మహబూబ్‌నగర్ వ్యవహారంలో హ్రస్వంకావడం గమనించవచ్చు. కింది ఉదాహరణలను గమనించండి.

| *ప్రామాణికం* | *వ్యావహారం* | |
|---|---|---|
| | ***చిత్తూరు**-మహబూబ్‌నగర్* | |
| **తిన్నాడు** | **తిన్నేడు** | తిన్నడు |
| విన్నాడు | విన్నేడు | **విన్నడు** |
| చదువుకొన్నారు | చదువుకొన్నేరు | చదువుకొన్నరు |

మిగతా క్రియారూపాల్లో -ఇనా- ప్రత్యయం చేరడం చిత్తూరు మహబూబ్‌నగర్ జిల్లాల వ్యవహారాల్లో గమనించవచ్చు. కొన్ని పరిస్థితులలో ఈ -ఇనా- రూపం సంక్షిప్తం కావడం రెండు జిల్లాలలో గమనించవచ్చు.

| **ఉదా :-** | *చిత్తూరు* | *మహబూబ్‌నగర్* |
|---|---|---|
| | రాసినాడు/రాస్నేడు | రాసిండు |
| | చేసినాడు/చేస్నేడు | చేసిండు |
| | వేసినాడు/వేస్నేడు | వేసిండు |

పై పదరూపాలను రెండు జిల్లాల్లోని శిష్టవ్యవహారంలో ఆధునిక ప్రామాణిక భాషలో వాడే రూపాలకు వాడుతున్నారు.

ఉదా :- రాశాడు
చేశాడు
వేశాడు

ఈ రూపంలోని పదాల వాడకం సమాజంలో ఎక్కువ గౌరవపదాలనే ఉద్దేశంతో శిష్ట, శిష్టేతరులు కూడ వాడడం గమనించవచ్చు.

## వ్యాకరణ భేదాలు

చిత్తూరు మహబూబ్‌నగర్ వ్యవహారాల్లో కొన్ని వ్యాకరణ బద్ధమైన భేదాలు కనిపిస్తాయి. ముఖ్యంగా క్రియాపదాలు, వాక్యాలు పరివర్తనంచెంది నపుడు తేడాలు కనిపిస్తాయి. ఉదాహరణకు వ్యతిరేకార్థ పరివర్తనాన్ని గమనించవచ్చు.

వ్యతిరేకార్థం (Negation) :- వ్యతిరేక క్రియారూపాల్లో చిత్తూరు వ్యవహారానికి మహబూబ్‌నగర్ వ్యవహారానికి కొంత తేడా కన్పిస్తుంది. ఈ వర్తమాన వ్యతిరేక క్రియారూపాల్లో ఎక్కువగా కన్పిస్తుంది.

కింది ఉదాహరణలను గమనించండి.

| వర్తమాన అవ్యతిరేకం | వర్తమాన వ్యతిరేకం | |
|---|---|---|
| ప్రామాణికం | చిత్తూరు | మహబూబ్‌నగర్ |
| తింటున్నాడు | తినేదిలేదు | తింటలేడు |
| వింటున్నాడు | వినేదిలేదు | వింటలేడు |
| చూస్తున్నాడు | చూసేదిలేదు | చూస్తలేడు |
| రాస్తున్నాడు | రాసేదిలేదు | రాస్తలేడు |
| చదువుతున్నాడు | చదివేదిలేదు | చదువుతలేడు |

పై వ్యతిరేక క్రియారూపాలను గమనిస్తే రెండు జిల్లాలకు చాల తేడా కన్పిస్తుంది. చిత్తూరు వ్యవహారంలో లింగ, వచన, పురుష భేదాలు కనపర్చకుండా అన్నింటికి ఒకే వ్యతిరేక క్రియారూపం కన్పిస్తుంది.

ఉదా :-

| | | |
|---|---|---|
| ఏక | అతడు | తినేదిలేదు. |
| | ఆమె | |
| | అది | |
| బహు | వాళ్ళు | |
| | అవి | |

చిత్తూరు వ్యవహారంలో పై చూపించిన వ్యతిరేక క్రియారూపాలనే వర్తమాన, భవిష్యత్తుకాలాల్లోకూడ వాడడం గమనించవచ్చు.

చిత్తూరు వ్యవహారంలోవలె కాకుండా మహబూబ్‌నగర్ వ్యవహారంలో లింగ, వచన, పురుష ప్రత్యయాలు వేర్వేరు రూపాలలో కన్పిస్తాయి.

ఉదా :-

అతడు తింటలేడు

| | | |
|---|---|---|
| ఏక | ఆమె | తింటలేదు |
| | అది | |
| బహు | వాళ్ళు | తింటలేరు |
| | అవి | తింటలేవు |

మహబూబ్‌నగర్ వ్యవహారంలో పైన చూపించిన వ్యతిరేకార్థ రూపాలే కాకుండా అక్కడక్కడ వేరొక రూపంలో వ్యవహరించడం గమనించవచ్చు.

కింది ఉదాహరణలను గమనించండి.

| అవ్యతిరేకం | వ్యతిరేకం |
|---|---|
| వస్తుండు | రాకొచ్చిండు |
| తింటుండు | తినకొచ్చిండు |
| వింటుండు | వినకొచ్చిండు |
| పోతుండు | పోకొచ్చిండు |

పై రూపాలను గమనిస్తే వ్యతిరేక క్రియారూపాలు రెండు క్రియల (తిన్ + వచ్చిండు) మధ్య వ్యతిరేక ప్రత్యయం (అక) చేరడంవల్ల ఏర్పడు తుందని చెప్పవచ్చు. ఈ రూపాలు ఇతర జిల్లాలలో అక్కడక్కడ వాడటం గమనించవచ్చు. వ్యతిరేక క్రియలు కింది విధంగా ఏర్పడి యుండవచ్చు.

క్రియ + వ్యతిరేక ప్రత్యయం + క్రియ (వచ్చిండు) = వ్య. క్రియ

తిన్ + అక + వచ్చిండు = తినకొచ్చిండు (తినకవచ్చిండు)

రా + అక + వచ్చిండు = రాకొచ్చిండు (రాకవచ్చిండు)

ఈ క్రియలలోని /వ/ మహబూబ్‌నగర్‌లో /వొ/ గా మారడం ద్వార ప్రతి క్రియలో /కొ/ అనే వర్ణాన్ని చూడవచ్చు. అదే వర్ణము, నిజామాబాద్ ప్రాంతంలో /క/ గా ఉచ్చరిస్తారు, (ఉదా :- తినకచ్చిండు, రాకచ్చిండు, మొ॥)

ఇక అన్ని జిల్లాలలో శిష్ట వ్యవహారంలో వాడే వ్యతిరేకార్థ క్రియలు చిత్తూరు, మహబూబ్‌నగర్ జిల్లాల్లోగూడ గమనించవచ్చు.

అట్టి ప్రామాణిక రూపాలను కొన్నింటిని కింద చూపడం జరిగింది.

| | |
|---|---|
| తింటున్నాడు | తినడం/టం లేదు |
| రాస్తున్నాడు | రాయడం/టం లేదు |
| వింటున్నాడు | వినడం/టం లేదు |

ఈ రూపాలు తెలుగుప్రాంతమంతటా ఎక్కువగా శిష్ట వ్యవహారంలో ఉండడం గమనించవచ్చు.

## పదాలవాడకం (Lexical usage)

చిత్తూరు, మహబూబ్‌నగర్ జిల్లాల పదాల వాడకంలో చాల తేడాలు కన్పిస్తాయి. సాధారణంగా ఒక మండలంవారు వాడిన పదం వేరే మండలం

వారికి అర్థం కాకుండా ఉంటాయి. రెండు జిల్లాల వ్యవహారంలో వాడే కొన్ని పదాలు కింద చూపించడం జరిగింది.

| చిత్తూరు | మహబూబ్‌నగర్ |
|---|---|
| తగరారు | తగాద |
| ఎనుములు | బర్లు (బర్రులు) |
| గెనెం | గెరుసు/గట్టు/ఒరం |
| మడక | నాగలి |
| గోఆకు | పుండికూర |
| రాగులు | తైదలు |
| దాహం | దూప |
| దిగులు | బుగులు/భీతి |
| పసులు | దూళ్ళు |
| కాడి | కాడిమేకు |

క్రియలు :-

| | |
|---|---|
| పూడ్చినాడు | పోయిండు |
| అరిసిండు | వొర్లిండు |
| తీసిస్తారు | ఇప్పిస్తారు |
| **ఎరువు దోల్తం** | **ఎరువు ఏస్తం** |
| సచ్చిపోయినాడు | కాలమైండు/సచ్చిపోయిండు |

బంధుత్వపదాలు :- (కర్ణాటక సరిహద్దుల్లో ఎక్కువ కన్పిస్తాయి)

| | |
|---|---|
| నాయన | అప్ప |
| చిన్నాయన | చిన్నప్ప |
| పెదనాయన | పెద్దప్ప |
| అమ్మమ్మ / నాయనమ్మ | అవ్వ |

## వాక్యనిర్మాణం

సాధారణంగా తెలుగు వాక్యంలో కర్త (**subject**) కర్మ (**object**) క్రియ (**verb**) క్రమంలో ఉంటాయి. తెలుగు వాక్యాంతంలో క్రియలు ఉండటం ద్వారా దీనిని క్రియాంత భాషగా (**verb final language**) గుర్తించడమైనది. వాక్యంలో కర్తకు, క్రియకు మధ్య అన్వయం (**agreement**)ను గమనించవచ్చు. కావుననే కర్తననుసరించి క్రియ (అంతం)లో మార్పు రావచ్చు.

ఇంగ్లీషు వాక్యక్రమంలో ఒక ఖచ్చితమైన నిబంధనను పాటిస్తుంది. ఆ క్రమం అనుసరించకపోతే ఆవాక్యం తప్పుగాభావించవచ్చు. తెలుగుభాషలో కూడ ఒక క్రమాన్ని అనుసరించి వాక్య నిర్మాణం జరుగుతుంది. కాని కొన్ని పరిస్థితుల్లో ఆ క్రమం మారే అవకాశం ఉంది. ఉదాహరణకు వాక్యాల క్లెఫ్ట్

నిర్మాణాన్ని పరిశీలిస్తే వాక్యంలోని పదాంశ ప్రాధాన్యాన్ని బట్టి ఊనిక (stress) స్థానాలు మారడం గమనించవచ్చు. ఈ ఊనికల మార్పువల్ల వాక్యాల అర్థంలో ఒక రకమైన విస్తరణం గమనించవచ్చు.

ఉదా:- 1) వాడు అన్నం తినలేదు. (భోంచేయలేదు)
2) వాడు అన్నం తినలేదు. (రొట్టెతిన్నాడు)
3) అన్నం వాడు తినలేదు. (కుక్క తిన్నది)

పై వాక్యాల్లో మొదటిది భోంచేయలేదనే అర్థంలో వాడడం, రెండవ వాక్యంలో అన్నం పదంపై ఊనికవల్ల అర్థంలో కొంత మార్పురావడం, మరి మూడవ వాక్యంలో పదక్రమంలో మార్పు రావడంద్వారా ఇంకోరకమైన అర్థం రావటం గమనించవచ్చు. చిత్తూరు వ్యవహారంలోని వాక్యాల పద క్రమంలో మార్పును కింది ఉదాహరణాలలో గమనించవచ్చు.

| వ్యవహారంలో | ప్రామాణికంలో |
|---|---|
| 1) బెల్లం వాళ్ళు తీయరు మామూల్గా | 1) మామూల్గా వాళ్ళు బెల్లం తీయరు |
| 2) విరోధులమాద్రే ఉండారుకొంతమంది | 2) కొంతమంది విరోధుల మాద్రే ఉంటారు/ఉన్నారు- |
| 3) ఒ ఫెన్సేకర్స్ ఏసినంసార్ మామిడి చెట్లు, | 3) మామిడిచెట్లు ఓ ఫెన్సేకర్స్ వేసినాంసార్, |

పై ఉదాహరణలను పరిశీలిస్తే వ్యవహారంలో ఎక్కువగా పదక్రమంలో మార్పు కన్పిస్తుంది. ఈ మార్పు పదాంశ ప్రాధాన్యతను బట్టి మరి ప్రశ్న క్రమాన్ని బట్టికూడ జరుగుతుందని చెప్పవచ్చు.

నామీకరణం (Nominalization) :- "ఒక వాక్యాన్నిగాని, క్రియను గాని కొన్ని మార్పులతో మరో వాక్యంలో కర్తృ కర్మ పదస్థానాల్లో ప్రయోగించే పద్ధతిని నామీకరణం అంటారు.

నామీకరణాలు ఎన్నోరకాలుగా ఏర్పడవచ్చు. వాటిలో భావార్థక నామీకరణం ఒకటి. సాధారణంగా క్రియలు వ్యాపారాలను, స్థితులను, చర్యలను, సంఘటనలను తెల్పుతాయి. అయితే ఈ క్రియా ధాతువులకు అడం/అటం అనే ప్రత్యయం చేరడంద్వార భావార్థక రూపాలు ఏర్పడుతాయి, ప్రామాణిక భాషలో భావార్థకాలు పై ప్రత్యయాలు క్రియాధాతువులకు చేరడం ద్వారానే ఏర్పడుతాయి, కాని తెలంగాణా జిల్లాల వ్యవహారంలో అడం/అటం ప్రత్యయాలకు బదులు -డు- అనే ప్రత్యయం చేరడం గమనించవచ్చు. కొన్నిపదాలు కింద చూపించడమైనది.

| క్రియాధాతువులు | భావార్థకాలు | |
|---|---|---|
| | తెలంగాణా | ప్రామాణికం |
| తిను | తినుడు | తినడం/టం |
| రాయు | రాసుడు | రాయడం/టం |

| | | |
|---|---|---|
| చూడు | చూసుడు | చూడడం/టం |
| చేయు | చేసుడు | చేయడం/టం |
| కొట్టు | కొట్టుడు | కొట్టడం/టం |
| తిట్టు | తిట్టుడు | తిట్టడం/టం |

పై ఉదాహరణలు సాధారణంగా తెలంగాణా ప్రాంతమంతట వాడే భావార్థకాలుగా చెప్పవచ్చు. కాని చిత్తూరు, మహబూబ్‌నగర్ వ్యవహారాల్లో పైన చూపించిన ప్రత్యయాలే కాకుండా -ఏది, -అకం, అనే ప్రత్యయాలు కూడ క్రియాధాతువులకు చేరడం గమనించవచ్చు. ఈ అకం అనే ప్రత్యయం కొన్ని పదాలలో తెలుగుదేశమంతటా వాడడం గమనించవచ్చు.

ఉదా :- నమ్మకం, అమ్మకం, వంటకం, పెంపకం, పంపకం మొ॥

ఈ పదాలన్నికూడ క్రియారూపాల నుండి నిష్పన్నమైన భావార్థకాలే నని చెప్పవచ్చు. ఈ అకం ప్రత్యయం మహబూబ్‌నగర్ వ్యవహారంలో అన్ని క్రియారూపాలకు చేరడం గమనించవచ్చు. చిత్తూరు వ్యవహారంలో -ఏది అనే ప్రత్యయం ఎక్కువగా వాడుకలో ఉన్నట్లు గమనించవచ్చు.

భావార్థకాలు

| చిత్తూరు | మహబూబ్‌నగర్ |
|---|---|
| రాసేది | రాస్కం |
| చేసేది | చేస్కం |
| తినేది | తిన్కం |
| పండేది | పండకం |
| లేసేది | లేస్కం |
| కొట్టేది | కొట్టకం |

క్రియాధాతువులలోని /య/ కారం భావార్థకాలలో /స/ కారంగా మారడం గమనించవచ్చు.

అయితే ప్రామాణిక భాషలోని అటం/డం రూపాలను ఈ ప్రాంతాలలో పూర్తిగా వాడుకలో లేవని చెప్పడానికి వీలులేదు. శిష్ట వ్యవహారంలో, మరి ఇతర ప్రాంతాలవారితో మాట్లాడేటప్పుడు ప్రామాణిక రూపాలను వాడటం గమనించవచ్చు.

చిత్తూరు మహబూబ్‌నగర్ వ్యవహారాల్లో ఈభావార్థకాలకు విభక్తిప్రత్యయాలు చేర్చడంలోకూడ కొంత తేడా కన్పిస్తుంది. ముఖ్యంగా అడం/టం అంతనామానికి ప్రయోజనార్థంలో "కి" విభక్తి ప్రత్యయం చేరడం ప్రామాణిక భాషలో గమనించవచ్చు. కాని చిత్తూరు, మహబూబ్‌నగర్ వ్యవహారాల్లో వేర్వేరు రూపాలలో గమనించవచ్చు. ఈరెండు జిల్లాల వ్యవహారంలోని ప్రయోజనార్థంలో వాడే రూపాలను కొన్నింటిని కింద చూపించడమైనది.

| ప్రామాణికం | చిత్తూరు | మహబూబ్ నగర్ |
|---|---|---|
| తినడానికి | తినేదానికి | తిన్నికె/తిననికె |
| చేయడానికి | చేసేదానికి | చేయనికె |
| రాయడానికి | రాసేదానికి | రాయనికె |
| వినడానికి | వినేదానికి | విన్నికె/వినానికె |

పైన ఉదహరించిన పదాలలో చిత్తూరు వ్యవహారంలోని భావార్థకరూపానికి "కి" ప్రత్యయం చేరడం గమనించవచ్చు. మహబూబ్ నగర్ వ్యవహారంలో ప్రమాణ భాషలో వాడే భావార్థక సంజ్ఞారూపం అనగా భావార్థక పదంలోని డా/టా వర్ణంపోయి "కి" ప్రత్యయం "కె" గా మారడం గమనించవచ్చు.

ఒక మహబూబ్ నగర్ నివాసి గమనించేవిషయాలను, చిత్తూరు సర్వేలో సేకరించిన వ్యవహార భాషతో పోల్చి ఈ వ్యాసం వ్రాయడం జరిగింది. మహబూబ్ నగర్ సర్వే ఇంకా జరుగలేదు. ఒకవేళ ఆ జిల్లా సర్వే పూర్తిచేసినట్లైతే ఇంకా ఎన్నో ప్రత్యేక లక్షణాలను గమనించవచ్చు.

# 6

# భాషా వైవిధ్యం-చిత్తూరు కర్నూలు జిల్లాలు

శ్రీ కె. రమేష్ కుమార్

తెలుగునాడులో వ్యవహారంలో ఉండే తెలుగును చూసినట్లైతే ముఖ్యంగా కొన్ని భేదాలు గమనించవచ్చు.

ఉదా :- ఉండ (పూ.మ), గాను/గాలు (ద.మ)
గారె/గిర్ర/పయ్యె (ఉ.మ) చక్రం (మ.మ).

ప్రాంతీయం :- ఒకే అర్థానికి భిన్నపదాలను భిన్నప్రాంతాలలో వాడడం సాధారణంగా జరుగుతుంటుంది.

ఉదా :- పూజ/పూదు (పూ.మ), కాడిమాను/కాడిమాకు (ద.మ), కాండి/కాణి/కాని (ఉ.మ), కాడి (మ.మ). అలాగే వ్యాకరణ భాగాల్లో కూడా భేదాలుండవచ్చు.

ఉదా :- తిన్నాడు (మ.మ), తిన్నదు(ఉ.మ), తిన్నోడు/తినినాడు (ద.మ).

సాంఘికం :- సాంఘిక వ్యవస్థలో ఉన్న మార్పులు ఆర్థిక సాంస్కృతిక పరమైనవి వ్యవహర్తమాటల్లో కనిపిస్తాయి. పదాది వకారంలోపించడం శిష్టేతర వ్యవహారంలో కనిపిస్తుంది. ఉదా:- ఎవసాయం (వ్యవసాయం) ఇలాంటి మాటలను బట్టి వ్యవహర్త సాంఘిక స్థాయిని గుర్తించవచ్చు. వీటినే వర్గమాండలికాలంటారు.

చారిత్రకం :- ఒక కాలంలో ఏర్పడ్డ తుల్యరూపాలకు తరువాత కాలంలో ఏర్పడ్డ తుల్యరూపాలకు మధ్య భేదాలుండవచ్చు.

ఉదా :- మూలద్రావిడ పదాది 'చ' కారం దక్షిణద్రావిడ భాషల్లో తెలుగులో లోపించడం మిగిలిన ద్రావిడ భాషల్లో ఉండడం ఉంది. తె: ఉప్పు త,మ క.తు ఉప్పు, కో.నా.గ, సువ్, ప.చువ్.

తెలుగునాడును నాలుగు భాషామండలాలుగా విభజించవచ్చును. అందులో చిత్తూరు, కర్నూలు జిల్లాలు దక్షిణమండలానికి చెందుతాయి. తమిళనాడు చిత్తూరుకు సమీపవర్తి అవడంచేత తెలుగు, తమిళాలమీద పరస్పర ప్రభావం ఉంటుంది. ఈ వ్యాసంలో చిత్తూరు కర్నూలు జిల్లాల భాషా సామ్యాలను, వైవిధ్యాలను కొంతమేరకు పరిశీలించడం జరుగుతుంది.

నామాలు బహువచన రూపాలు :-

చిత్తూరు, కర్నూలు జిల్లాల వ్యవహారంలో బహువచనరూపాలు భిన్నంగా కన్పిస్తాయి.

1. ద్విమాత్రిక యకారాంత రూపాలు యధాతథంగా బహువచన ప్రత్యయంతో కర్నూలులో విన్పిస్తే "య" కారం "వ" కారం అయిన రూపాలు చిత్తూరు జిల్లాలో విన్పిస్తాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| భావులు | బావులు | బాయిలు |

2. కొడవలి, గొడ్డలి రూపాలలో ముందున్న 'ల' కారం మూర్ధన్యమవడం చిత్తూరు వ్యవహారంలో కనిపిస్తుంది. కాని కర్నూలు వ్యవహారంలో ఈ రూలు సంయుక్త ధ్వనులతోను మూర్ధన్య అమూర్ధన్య ల కారంతో ఉన్న రూపాలు కన్పిస్తాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| కొడవళ్ళు | కొడవళ్ళు | కొడేన్లు/కొడవళ్ళు/కొడవల్లు |
| గొడ్డళ్ళు | గొడ్డళ్ళు | గొడ్డేన్లు/గొడ్డళ్ళు/గొడ్డల్లు |

పురుషవాచకాలు:-

కర్నూలు వ్యవహారంలో ఉత్తమపురుష రూపాలు నేను. మేము లతో కన్నడ ప్రాంతానికి సమీపకేంద్రాలలో కన్నడ రూపాలు 'నాను, మాము' వంటి ఎగువ రూపాలున్నాయి.

| | ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|---|
| ఉ.పు | నేను | నేను | నేను/నాను |
| | మేము | మేము | మేము/మాము |

ప్రథమపురుష రూపాలు 'ఆమె, ఆయన, రూపాలతోపాటు "వామె, వాయన, వంటి రూపాలు కర్నూలు వ్యవహారంలో ఉన్నాయి.

| ప్రథమ | ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|---|
| స్త్రీ | ఆమె | ఆమె | ఆమె/వామె |
| పు | ఆయన | ఆయన | ఆయన/వాయన |

సంఖ్యావాచకాలు:-

ప్రామాణిక రూపాల్లో సంఖ్యావాచకాలు మహాప్రాణత్వంతో ఉంటాయి. చిత్తూరు, కర్నూలు జిల్లాల్లో మహాప్రాణాన్నికోల్పోయిన రూపాలుంటాయి. అయితే కర్నూలు వ్యవహారంలో నలభై, యాభై, ఎనభై వంటి రూపాలతోపాటు నలవై, యావై ఎనవై వంటి రూపాలుకూడా ఉన్నాయి. నూరు/వంద, "వెయ్యి/సావిరి" రూపాలు కర్నూలులో ఉన్నాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| నలభై | నలబై | నలబై /నలవై |

| | | |
|---|---|---|
| ఎనభై | ఎనబై | ఎనబై/ఎనవై |
| వంద | నూరు/వంద | నూరు/వంద |
| వెయ్యి | వెయ్యి | వెయ్యి/సావిరి. |

భూతకాల క్రియలు :-

చిత్తూరు వ్యవహారంలో ఉండు క్రియ భూతకాలంలో సమీకృత రూపంగా కన్పిస్తుంది. (ఉండ్ ధాతువులోని 'డ' కారము ఇనాలోని 'ఇ' కారమూ లోపిస్తాయి. అందువలన నకార ద్విత్వము, 'అ' కారము 'ఏ (ఙ:) కారణమవడం జరిగినాయి. ఉదా:- ఉన్నేడు, ఉన్నేది, ఉన్నేయి. అలాగే 'నకారాంత ధాతురూపాలకు, ద్విమాత్రిక మూర్ధన్యాంత రూపాలకు ఇనా ప్రత్యయం చేర్చినప్పుడు 'అ' కారం 'ఏ' కారం కావడం కన్పిస్తుంది.)

కర్నూలు వ్యవహారంలో పై రూపాలు కడప సమీప కేంద్రాలలో కన్పిస్తాయి. తక్కిన చోట్ల ఎ-/ఇనా/ ప్రామాణిక రూపం ఏ (ఙ:) కన్పిస్తాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| ఉన్నాడు | ఉన్నేడు | ఉండె/ఉన్నేడు/ఉన్నాడు |

నకారాంత ధాతురూపాలు :-

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| కొన్నాడు | కొన్నేడు | కొన్నాడు/కొన్నేడు |
| తిన్నాడు | తిన్నేడు | తిన్నాడు/తిన్నేడు |
| విన్నాడు | విన్నేడు | విన్నాడు/విన్నేడు |

ద్విమాత్రిక మూర్ధన్యాంత రూపాలు :-

| | | |
|---|---|---|
| కొట్టేడు | కొట్న్నేడు | కొట్టేడు/కొట్న్నేడు |
| పెట్టేడు | పెట్న్నేడు | పెట్టేడు/పెట్న్నేడు |
| తిట్టేడు | తిట్న్నేడు | తిట్టేడు/తిట్న్నేడు. |

వ్యతిరేక క్రియలు :-

భూతకాల వ్యతిరేక క్రియల అన్నంత రూపాలకు 'లేదు' అనే ప్రత్యయం చేర్చేందు వలన చిత్తూరు వ్యవహారంలో వ్యతిరేక క్రియలు ఏర్పడు తున్నాయి. ఈ ప్రత్యయం సర్వలింగ, వచనబోధకం. కర్నూలు వ్యవహారంలో పై రూపాలతో పాటు కొన్ని కేంద్రాలలో క్త్వార్థక క్రియా రూపాలకు 'లేదు' ప్రత్యయం చేరడంవల్ల వ్యతిరేక క్రియలు ఏర్పడు తున్నాయి. ఈ రూపం పురుషవచన భేదాన్ని బట్టి మారుతుంది. ఈ విధంగా ఏర్పడిన క్రియలు అన్వయాన్ని కలిగి ఉన్నాయి.

| | ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|---|
| ఉత్తమ | నేను రాలేదు | నేను రాలేదు | నేనువచ్చిలేన /రాలేదు |
| | మేము రాలేదు | మేము రాలేదు | మేమువచ్చిలేము/రాలేదు |
| మధ్యమ | నువ్వురాలేదు | నువ్వురాలేదు | నువ్వువచ్చిలేవు/రాలేదు |
| | మీరు రాలేదు | మీరు రాలేదు | మీరువచ్చిలేరు/రాలేదు |
| ప్రథమ | ఆయనరాలేదు | ఆయనరాలేదు | ఆయనవచ్చిలేడు/రాలేదు |
| | ఆమెరాలేదు | ఆమెరాలేదు | ఆమె వచ్చిలేదు/రాలేదు |
| | వాళ్ళురాలేదు | వాళ్ళురాలేదు | వాళ్ళువచ్చిలేరు/రాలేదు |

భూతకాల వ్యతిరేక క్రియల్లో రెండవ అక్షరం సంయుక్తమైతే ('చ' కార, 'స' కారలు) 'చ' కార, 'స' కారాలు లోపించి ద్విత్వము చెందుతుంది. ఇటువంటి రూపాలు కర్నూలు కేంద్రాలలో కొన్నింటిలో కనిపిస్తాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| పిలవలేదు | పిల్చలేదు | పిల్లేదు |
| కలవలేదు | కల్వలేదు | కల్లేదు |

చిత్తూరు, కర్నూలు జిల్లాల వ్యవహారంలో వర్తమాన భవిష్యత్, వ్యతిరేక రూపాల్లో ప్రామాణిక రూపాలు వాడేటప్పుడు మాత్రం వర్తమాన, భవిష్యత్ వ్యతిరేకాలకు పదరూపంగా తేడాలుంటాయి. ప్రాంతీయంగా వాడే రూపాల్లో కాలబోధక పదాలు (ఉదా:- నిన్న, రేపు) వాడేందువలన వర్తమాన, భవిష్యత్తు వ్యతిరేక క్రియలకు తేడా కన్పిస్తుంది. చిత్తూరు వ్యవహారంలోని రూపం కర్నూలు వ్యవహారంలో సంక్షిప్తమైనట్లు కనిపిస్తుంది.

| ప్రా.రూ | | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|---|
| వర్తమాన | భవిష్యత్ | | |
| రావడంలేదు | రాను | వచ్చేదిలేదు | వచ్చేల్దు (<వచ్చేదిలేదు) |
| తినడంలేదు | తినను | తినేది లేదు | తినేల్దు (<తినేది లేదు) |

ప్రశ్నార్థకాలు :—

1) "యాడికి, యెందుకు" వంటి ప్రశ్నార్థక రూపాలు చేర్చేందువలన వాక్యేతర శబ్దాపేతుక ప్రశ్నలు ఏర్పడతాయి. ఈ రూపాలు రెండు జిల్లాల్లో కన్పిస్తాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| ఎక్కడికిపోతున్నావు | యాడికిపోతాండావు | యాడికి పోతాన్నావు |
| ఎందుకు పోతున్నావు | యెందుకుపోతాండావు | యెందుకుపోతాన్నావు |

ఆ కారాన్ని వాక్యాంతంలో చేర్చడంవల్ల అవును, కాదు. అనే సమాధానం వచ్చే వాక్యాంత శబ్దాపేతుక ప్రశ్నలు ఏర్పడుతాయి,

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| రేపుచదువుతావా | రేపుచదువుతావా | రేపుచదువుతావా |

కర్నూలు జిల్లా వ్యవహారంలో మధ్యమ పురుష భూతకాల వాక్యాంత
౦ పేక్షక ప్రశ్నారూపాల్లో ఏ (ఊ:) అనే రూపం ఉంది.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| నీవు ఉన్నావా | నువ్వు ఉన్నేవా | నువ్వుంటివే |
| నీవు పోయావా | నువ్వు పోయ్నావా | నువ్వుపోతివే |

క్రియాధాతువుల్లో మార్పులు:-

చిత్తూరు జిల్లా వ్యవహారంలో క్రియాధాతువులోని అగ్రవర్తులీకృతాచ్చు
ర్ధక రూపంలో నిమ్నాచ్చుగా మారడంకన్పిస్తుంది. ఇలామారడానికి కార
౦ స్వర సమత అని చెప్పవచ్చు. శత్రర్థక రూపంలోని నిమ్నాచ్చువలన
యాధాతువులోని అగ్రవర్తలీకృతాచ్చు నిమ్నాచ్చు అయి ఉండవచ్చని
ప్పవచ్చు. కర్నూలు వ్యవహారంలో ఈ విధమైన మార్పులేదు. అయితే
తర్థక రూపంలో సంయుక్త హల్లు "స" కార "త" కారాలైతే "త" కారం
౦" కారంతో వర్ణ సమీకరణం చెందడం శిష్టేతర వ్యవహారంలో కన్పిస్తుంది.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు | |
|---|---|---|---|
| | | శిష్ట | శిష్టేతర |
| ుస్తున్నాడు | ఏడస్తాండాడు | ఏడుస్తాన్నాడు | ఏడుస్సాన్నాడు |
| రుగుతున్నాడు | తిరగతాండాడు | తిరుగుతాన్నాడు | తిరుగుతాన్నాడు |
| డుగుతున్నాడు | అడగతాండాడు | అడుగుతున్నాడు | అడుగుతున్నాడు |

విధ్యర్థక బహు వచనరూపం :-

చిత్తూరు వ్యవహారంలో 'అండి' రూపం మాత్రం కన్పిస్తుంది. కర్నూలు
్యవహారంలో 'అండి, ్రి' రూపాలున్నాయి.

| చిత్తూరు | కర్నూలు |
|---|---|
| దున్నండి | దున్నండి/దున్న్రి |
| తినండి | తినండి/తిన్రి |

నామీకరణరూపాలు :-

చిత్తూరు, కర్నూలు వ్యవహారాల్లో నామీకరణ రూపాలు కింద ఇవ్వడం
ఁరుగుతుంది. కర్నూలు వాడుకలో 'అడం' లోపించిన రూపాలున్నాయి.

| ప్రా.రూ | చిత్తూరు | కర్నూలు |
|---|---|---|
| దున్నడం | దున్నడానికి | దున్ననీకి |
| తినడం | తినడానికి | తిననీకి |
| చెయ్యడం | చెయ్యడానికి | చెయ్యనీకి |
| పిల్చడం | పిల్చడానికి | పిల్చనీకి |

బంధుత్వ వాచకాలు:-

చిత్తూరుజిల్లా వ్యవహారంలో తండ్రి తల్లిని, తల్లి తల్లిని తెలిపేబంధుత్వ
వాచక పదాలు రెండు వేరు, వేరుగా ఉన్నాయి. కాని కర్నూలు జిల్లాలో

పై బంధుత్వ వాచకపదాలు కొన్ని కేంద్రాలలో వేరు వేరుగా లేవు. అందు వలన అర్థభేదం పదరూపంలో కనిపించదు. చిత్తూరు జిల్లాలో వియ్యంకుడు, వియ్యపురాలు అనే పదాలున్నాయి. ఈ రూపాలు కర్నూలులోని కొన్ని కేంద్రాలలో 'బీగుడు, బీగురాలుగా' ఉన్నాయి. చిత్తూరు, కర్నూలు జిల్లాల వ్యవహారంలో తేడాలున్న బంధుత్వవాచక పదాలను కింద ఇవ్వడం జరుగుతుంది.

| చిత్తూరు | కర్నూలు |
|---|---|
| అవ్వ<br>జేజి | అవ్వ |
| తాత<br>జేజినాయ్న | తాత |
| వియ్యంకుడు | బీగుడు |
| వియ్యపురాలు | బీగురాలు |
| తోడికోడలు | యారాలు |
| కూతురు | బిడ్డ |

చిత్తూరు, కర్నూలు జిల్లాల పల్లెల్లో శిష్టేతరులలో ఎక్కువగా, శిష్టులలో కొందరిలో, బంధుత్వవాచక పదాలు భిన్నకులాల వారిమధ్య ఒకరి నొకరు సంబోధించుకోడానికి ఉపయోగిస్తారు. ఈ పదాలు వాళ్ళ సన్నిహితత్వాన్నిగాని మర్యాద సూచకత్వాన్నిగాని తెలియచేస్తాయి. ఈ విధంగా బంధుత్వవాచక పదాలు పైన చెప్పినట్లు విస్తృతార్థంలో వాడుకలో ఉన్నాయి.

చిత్తూరు కర్నూలు జిల్లాల్లో కొన్ని పదాలకున్న అర్థాలను కిందఇవ్వడం జరుగుతుంది.

| | చిత్తూరు | | కర్నూలు |
|---|---|---|---|
| 1) | సెలవు | ఖర్చు పెట్టు<br>విరామదినం | సెలవు-విరామదినం |
| 2) | ఎత్తు | పైకిలేపు<br>కొను | ఎత్తు - పైకిలేపు |

(i) 'సెలవు' అనే పదానికి 'విరామదినం' అనే అర్థం తెలుగునాడు అంతటా ఉంది. కాని చిత్తూరు జిల్లాలో ఈ అర్థంతోపాటు 'ఖర్చుపెట్టు' అనే అర్థంకూడా ఉంది. ఈ రెండవ అర్థంద్రావిడ భాషల్లో ఉంది. (ఉదా॥ తమిళం) దీన్ని బట్టి ఈ అర్థం చిత్తూరులో నిల్చి ఉందని చెప్పవచ్చు.

(ii) ఎత్తు అనే పదానికి చిత్తూరు వ్యవహారికంలో రెండు అర్థాలున్నాయి. ఒకటి మామూలుగా తెలుగునాడు అంతటా వాడుతారు. (పైకిలేపు) రెండవది 'కొను' చిత్తూరు జిల్లాకే పరిమితం.

చిత్తూరు, కర్నూలు జిల్లాల వ్యవహారంలో తేడాలున్న కొన్ని పదాలివి.

| **చిత్తూరు** | కర్నూలు |
|---|---|
| చెనిక్కాయలు | బుడ్డలు |
| పిల్లోడు | పొట్టెగాడు |
| నిచ్చెన | మిచ్చెన |
| తొట్టి | అపుతుకాన/గచ్చు |
| పూడ్చినాడు | పోయినాడు |
| గిన్నెలు | తల్లీలు |
| చిన్నది | సన్నది |
| మొరటోడు | మోటోడు |
| ఓలిగెలు | బచ్చెలు |
| ఊరక | వూకే |
| ఎనుము | ఎనపగొడ్డు |
| ఎతుకు | బుడుకు |
| గుబులు | బుగులు |
| మటిక్కాయలు | చౌళికాయలు |
| స్తంబము | కంబము |

ఈ వ్యాసంలో కర్నూలు చిత్తూరు జిల్లాల్లో బాగా కొట్టవచ్చినట్లు ...చే తేడాలను కొన్ని మాత్రం ప్రస్తావించడం జరిగింది. ఇంకా పరిశో... చాలా తేడాలు కన్పించవచ్చు. అయితే ఈ రెండు జిల్లాల్లో సమాన ...లు లేవని ఈ వ్యాసం ఉద్దేశం కాదు. ఈ జిల్లాల్లో ప్రాంతీయ రూపా... పాటు ప్రామాణిక రూపాలున్నాయి.

---

పూ.మ = పూర్వమండలం, ద.మ = దక్షిణ మండలం. ఉ.మ = ఉత్తర మండలం, మ.మ = మధ్యమండలం
ప్రా.రూ = ప్రామాణిక రూపం, ఉ.పు = ఉత్తమ పురుష

7

# చిత్తూరు - ఆదిలాబాద్ వ్యవహారాలు - కొన్ని విశేషాలు

శ్రీ కె. లక్ష్మీనారాయణశర్మ

వ్యవహార మండలాల్లో చిత్తూరు దక్షిణ మండలానికి, ఆదిలాబాద్ ఉత్తర మండలానికీ చెందుతాయి. ఈ రెండు వ్యవహారాలు భౌగోళికంగా భిన్న ప్రాంతాలకు చెందిన వైనప్పటికీ కొన్ని పోలికలు కన్పిస్తాయి.

ప్రస్తుత వ్యాసంలో వీటికి సంబంధించిన వర్ణ, వ్యాకరణ లక్షణాలను గ్రహించి విశ్లేషించడం జరిగింది. పదజాలంలో కన్పించే వైవిధ్యాన్ని ఎత్తి చూపడం జరిగింది.

## వర్ణదశ

చిత్తూరు, ఆదిలాబాదు వ్యవహార మండలాల్లో విద్యాధికుల, నిరక్షరాస్యుల వ్యవహారంలో సాధారణంగా కన్పించే లక్షణాలలో కొన్ని పోలికలున్నాయి.

1) మహాప్రాణత్వ లోపం : రెండు మండలాల్లోను ప్రత్యేకించి, పరిశీలనార్థం మాట్లాడుతూన్నప్పుడు లేదా రూపాత్మక (formal) సందర్భాల్లో తప్ప మహాప్రాణాలు కన్పించవు.

| ప్రామాణికరూపం (ప్రా. రూ.) | చిత్తూరు (చి) | ఆదిలాబాద్ (ఆ) |
|---|---|---|
| ముఖ్యం | ముక్యం | ముక్యం |
| స్వాధీనం | స్వాదీనం | సాదీనం |
| భూమి | బూమి | బూమి |
| అధికారం | అదికారం | అదికారం |

2) సంయుక్తాల మార్పు : సంయుక్తాలు సాధారణంగా సమీకరణ పొందడం గానీ, అసంయుక్తాలుగామారడం కానీ జరుగుతుంది. రెండు మండలాల్లోను సంయుక్తాక్షరాల సమీకరణ భిన్నంగా కన్పిస్తోంది.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| మధ్య | మజ్జ | మద్దె |

| | | |
|---|---|---|
| ప్రత్యేకం | ప్రచ్చేకం | ప్రత్తేకం |
| ఉద్యోగం | ఉజ్జోగం | ఉద్దోగం |

3) మూర్ధన్యతలోపం: రెండు మండలాల్లోనూ ముఖ్యంగా నిరక్ష...స్యుల వ్యవహారంలో ఈ లక్షణం ఎక్కువగా కన్పిస్తోంది.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| నీళ్లు | నీల్లు | లీల్లు |
| కాణి | కాని | కాని |
| వీళ్లు | వీల్లు | ఈల్లు |

4) స్వర లోపం: పదమధ్యంలో స్వరం లోపించి సంయుక్తాలు ...డ్డం కూడా ఈ రెండు మండలాల్లో సాధారణ లక్షణంగా కన్పిస్తుంది.

| ప్రా. రూ. | చి/ఆ |
|---|---|
| కరణం | కర్నం |
| వెంకటరమణ | వెంక్రటరమణ |

) వర్ణలోపాలు:

1) ఏకాక్షర దీర్ఘ స్వరాంత క్రియారూపాల్లో వ్యతిరేకాన్ని సూచిం...ప్పుడు చిత్తూరు మండల వ్యవహారంలో, క కార లోపం కన్పిస్తుంది. ...దిలాబాద్ మండలంలో ఈ లోపం కన్పించదు.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| లేకపోతే | లేపోతే | లేకుంటే |
| రాకపోతే | రాపోతే | రాకుంటే |

2) పదాదిన హకారలోపం రెండు మండలాల నిరక్షరాస్యుల వ్యవహా...రాలలో కన్పిస్తుంది.

| ప్రా. రూ. | చి/ఆ |
|---|---|
| హక్కు | అక్కు |

3) పదాదిన వకారం రెండు మండలాల్లోనూ విద్యావంతుల వ్యవహా...రంలో లోపించదు. నిరక్షరాస్యుల వ్యవహారంలో మాత్రం అధికంగా లోపిం...న రూపాలే కన్పిస్తాయి.

| ప్రా. రూ. | చి/ఆ |
|---|---|
| వాడు | ఆడు |
| వచ్చాడు | అచ్చినాడు/అచ్చిండు |

వకారాది పదరూపాలు (పదబంధాలుగా) వేరే పదరూపాల్తో కలిపి ప్రయోగించినప్పుడు వకార పరివర్తనం కానీ లోపంకానీ కన్పిస్తుంది.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| మనవాళ్ళు | మనోళ్ళు | మనోల్లు |
| పిల్లవాడు | పిల్లోడు | పిలగాడు |

## వ్యాకరణదశ

ఈ విభాగంలో కన్పించే లక్షణాలు అధిక భాగం రెండు వ్యవహార మండలాల మధ్య భేదాల్ని సూచిస్తాయి.

1) ఆదిలాబాద్ వ్యవహారంలోని బహువచన రూపాల్లో వర్ణవ్యత్యయం కన్పిస్తుంది. చిత్తూరు మండలంలో ఈ లక్షణం కన్పించదు.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| వేర్లు | పేర్లు | పేర్లు |
| వేర్లు | వేర్లు | వేర్లు |

2) ప్రాచీనాంధ్రానికి లక్షణంగా నిలిచే అనునాసిక పూర్వదీర్ఘం రెండు మండలాల్లోనూ కన్పిస్తుంది.

| ప్రా. రూ. | చి/ఆ |
|---|---|
| కాడి | కాండి, కాండ్లు |
| ఏడు | ఏండు, ఏండ్లు |

3) సంఖ్యావాచకాల్లో ముఖ్యంగా 14 ను, 90 ను సూచించేప్పుడు ఆదిలాబాద్ జిల్లా వ్యవహారంలో (విద్యావంతుల వ్యవహారంలోనూ) మూర్ధన్యీకృత రూపం కన్పిస్తుంది.

| చి | ఆ |
|---|---|
| పద్నాలుగు | పడ్నాలుగు |
| తొంభై | టొంబై |

4) క్రియారూపాల విధ్యర్థక బహువచన రూపాలు రెండు ప్రాంతాల్లోనూ భిన్నంగా కన్పిస్తున్నాయి

| చి | ఆ |
|---|---|
| చెయ్యండి | చెయ్యుండి, చెయ్యుర్రి చెయ్యుల్లి |
| రండి | రండ్రి, రర్రి, రల్లి |

5) 'ఉండు' క్రియ భూతార్థంలో ఆదిలాబాద్ ప్రాంతంలో హ్రస్వాచ్చుతో కన్పిస్తే, చిత్తూరు ప్రాంతంలో దీర్ఘాచ్చుతో కన్పిస్తుంది.

| చి | ఆ |
|---|---|
| ఉణ్నాను | |
| ఉండాను | ఉన్నను/ఉంటి |
| ఉన్నేను | |

6) క్రియల్లో కాలవాచకాల్లో చిత్తూరు మండలంలో దీర్ఘరూపాలు, ఆదిలాబాద్ వ్యవహారంలో హ్రస్వరూపాలు కనిపిస్తాయి.

| | చి | ఆ |
|---|---|---|
| భవిష్యత్ | వస్తాను | వస్త |

| | | |
|---|---|---|
| | చేస్తాన | చేస్త |
| వర్తమానం | చేస్తున్నాను | చేస్తున్న |
| | పోతున్నాను | పోతున్న |
| భూతం | వచ్చినాను | అచ్చిన/వస్తి, అస్తి |
| | ఉన్నేను | ఉన్న/ఉంటి |

7) నిషేధార్థక రూపాల్లో చిత్తూరు ప్రాంతంలో 'అక' ప్రత్యయం కన్పిస్తే అదిలాబాద్ మండలంలో 'అక' మాత్రమే కన్పిస్తుంది.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| చెయ్యకు | చెయ్యాకు | చెయ్యకు |
| తినకు | తినాకు | తినకు |

8) శత్రర్థక రూపాల్లో రెండు మండలాల్లోనూ 'తా' ప్రత్యయం కన్పిస్తున్నా, ఆదిలాబాద్ మండలంలో 'తూ' ప్రత్యయం అధికంగా కన్పిస్తోంది.

| చి | ఆ |
|---|---|
| వింటా | వింటూ, వింటా |
| చేస్తా | చేస్తూ, చేస్తా |

క్రియారూపానికి 'కొంట' చేర్చి వాడడం ఆదిలాబాద్ మండలంలో ప్రత్యేక లక్షణంగా కన్పిస్తోంది.

| ప్రా. రూ. | ఆ |
|---|---|
| చేస్తూ | చేసుకుంట |
| చూస్తూ | చూసుకుంట |

9) నిశ్చయార్థకం మీద వచ్చే ప్రశ్నార్థక రూపాలు రెండు మండలాల్లోనూ ఒకే విధంగా కన్పిస్తున్నాయి.

| ప్రా. రూ. | చి/ఆ |
|---|---|
| రావాలా | రావాల్నా |
| చేయాలా | చేయాల్నా |

10) క్రియాజన్య విశేషణ ప్రయోగాల్లో ఆదిలాబాద్ మండలంలో అధికంగా తద్ధర్మార్థక రూపాల్లో 'ఏటి' ప్రత్యయం కన్పిస్తుంది. చిత్తూరు మండలంలో కన్పించదు.

| ప్రా. రూ. | ఆ |
|---|---|
| చేసేపని | చేసేటి పని |
| వచ్చేమనిషి | వచ్చేటి మనిషి |

11) భావార్థక క్రియారూపాలు రెండు మండలాల్లోనూ భిన్నంగా కన్పిస్తున్నాయి.

| ప్రా. రూ. | చి | ఆ |
|---|---|---|
| పిలవడం | పిల్సేది | పిల్సుడు |

| | | |
|---|---|---|
| ఉండడం | ఉండేది | ఉండుడు |
| కలవడం | కల్సేది | కల్సుడు |

12) నిశ్చయార్థక క్రియారూపాల్లో చిత్తూరు మండలంలో అధికంగా 'అల' ప్రత్యయం కన్పిస్తుంది. ఆదిలాబాద్ మండలంలో 'అల'తో పాటు 'అలె' ప్రత్యయం వాడకంలో ఉంది.

| ప్రా.రూ. | చి | ఆ |
|---|---|---|
| ఇయ్యాలి | ఇయ్యాల | ఇయ్యాల/ఇయ్యాలె |
| ఉండాలి | ఉండాల | ఉండాల/ఉండాలె |

13) సాధారణంగా శక్యార్థాన్ని భవిష్యత్తుతో సూచించినా, ప్రత్యేకించి చెప్పేప్పుడు, రెండు మండలాల్లోనూ కొద్ది భేదం కన్పిస్తుంది.

| ప్రా రూ. | చి | ఆ |
|---|---|---|
| చేయగలడు | చేయగలడు | చేయగల్గుతడు |
| తినగలడు | తినగలడు | తినగల్గుతడు |

ఆదిలాబాద్ మండలంలో శక్యార్థంలో 'గలుగు' తో పాటు 'జాలు' ప్రయోగం కన్పిస్తోంది.

ఉదా : ఉండజాల్తడు
పిలజాల్తడు
చేయజాల్తడు

14) ప్రేరణార్థక క్రియారూపాల వాడకంలో చిత్తూరు, ఆదిలాబాద్ వ్యవహారాల్లో కొద్ది తేడాలు కన్పిస్తాయి.

| ధాతురూపం | చి | |
|---|---|---|
| చేయు | చేపిచ్చు | చేయిపించు |
| కొట్టు | కొట్టిచ్చు | కొట్టిపించు |

## పదజాలం

భౌగోళికంగా భిన్నవ్యవహార మండలాల్లో ఉండటం కారణంగా పదాల వాడకంలో తేడాలు కొట్ట వచ్చినట్లుగా కన్పిస్తాయి. ఒక ప్రాంతంలో కన్పించినవి మరో ప్రాంతంలో కన్పించవు. ఉదాహరణకు కొన్ని మాత్రం తీసుకుంటున్నాం.

(a) అవ్యయాల వాడకంలో నిరక్షరాస్యుల వ్యవహారంలో బేదాలు కన్పిస్తాయి.

| ప్రా.రూ. | చి | ఆ |
|---|---|---|
| అట్లా | అట్టా | గట్ల |
| ఇట్లా | ఇట్టా | గిట్ల |
| ఎట్లా | ఎట్టా | యెట్ల |

(b) ఇతరపదాలు

చిత్తూరు

దండిగా (= చాలా)

పూడ్సు (= పోవు)

యెనుము (= గేదె)

పెరుకు (= పీకు)

వచ్చేతలికి (= వచ్చేసరికి)

జీవాలు (= పశువులు)

కలుగు (= చిల్లి)

ముట్టింది (= కరిచింది)

పొదురు (= వణుకుడు)

తూము (= కాలువ)

ఆదిలాబాద్

కైకిలు (= కూలీలు)

వైయ్ (= పుస్తకం)

తొమ్మిదోకితాబ్ (= తొమ్మిదో తరగతి)

ఇసం (= చెడుపు)

పోపయింది (= సరిపోయింది)

కొవ్వు (= వయసు)

కెవ్వు (= కోపం)

గుల్లు (= ఫికర్, బెంగ)

అంకరమంకరం (= వంకర టింకర)

పొంగులుఉంచు (= కాగబెట్టు)

గదిరిచ్చు (= అదలించు, మందలించు)

పై పరిశీలనవల్ల చిత్తూరు, ఆదిలాబాద్ ప్రాంతాలు దూరంగా ఉన్నప్పటికీ అంతర్లీనంగా తెలుగు భాషా లక్షణాలను రంగరించుకొని భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని చాటుతున్నాయని భావించవచ్చు.

# 8

# వ్యవహార ఖండికలు

## వ్యవహర్త - 1

కేంద్రం : పుంగనూర్

వృత్తి : అడ్వకేట్

కులం : రజక, వయసు : 42

విద్య : బి. ఏ. బి. ఎల్

విషయం : చేపట్టిన కొన్ని కేసుల వివరాలు; తదితరాలు.

నా పేరు....... ఎడ్వొకేట్, పొంగునూర్. నివాసము వెంకట్రమణ సామి స్ట్రీట్ పొంగునూర్ టౌన్.

నేను వెయిన్ని తొమ్మన్నూటయాభై తొమ్మిది నుంచి క్రిమినల్ కోర్టులో...క్రిమినల్ సైడ్ ప్రేక్టీస్ చేస్తా ఉండాను. ఇందులో ముఖ్యంగా ఈ మద్దె ఈ ఎమర్జెన్సీ పిరీడ్లో అంటే బిఫోర్ జనతాపార్టీ సెంట్రల్ గవర్న మెంటు అధికారానికి రాకముందు ఎమర్జెన్సీ పిరీడ్ లో జరిగిన కేసులో ఒకటి ముక్యమైంది. ఇంపార్టెంట్ కేసు...నేను డీల్ చేసిన...ఈమద్దె ఆర్గ్యుమెంటు జేసేము. ఆకేసు సంగతి ఎట్లా అంటే కన్నూర్ దెగ్గర ఓ పల్లె. ఉల్లిగడ్ల పల్లెలో హరిజెన్స్కు రెడ్లకి కొంచెం ఒక బూమిని గురించి స్వాదీనాన్నిగురించి తగరారొచ్చి రెడ్లు గవర్న మెంటు బూములు స్వాదీనంలో ఉండేవాళ్ళు ఆక్రమణలో ఉండేదాన్ని ఈల్లు మా బూమి మాక్కావాల్లా అన్చెప్పి హరిజన్స పోవడమూ, వాల్లు ఈల్లు కొట్టుకోన్నేరు. ఆల్లకి గాయాలయినయ్, ఈల్లకి గాయాలయినయ్. ఇద్దరూ కంప్లైంట్స్ ఇచ్చినారు. ఎమర్జెన్సీ పిరియెడ్ గాబట్టి సదరు పోలీసువాల్లు హరిజన్స్ దావా మాత్రం తీస్కొని రెడ్లదావా రెఃఫర్ జేసినారు. ఆ రెడ్డి పార్టీవాల్లు కోర్టుకొచ్చినారు. ఈల్లు పోలీసు తరుపున కోర్టుకొచ్చినారు. రొండు కేసులు జెరిగినియ్. అది స్వాదీనాన్ని గురించి తగరార్లు బెట్టుకొని కొట్టుకోవడము అది గవర్నమెంటు బూమి కోసం కొట్టుకోన్నేరు. ఆ గవర్నమెంటు బూమి ఎవురిదేని ఓనర్ షిప్ గవర్న

మెంటు ఉంటేగూడా స్వాదీనము ఎవరికుందీ అనేది ముఖ్యమైన పాయింటు దాంట్లో. కాబట్టి రెడ్లు మాకు స్వాదీనముందీ అంటారు అదీ హరిజన్స్ మాకు స్వాదీనముందని వాల్లంటారు. అందుకోసరం దాన్ని గురించి స్వాదీనాన్ని గురించి పేచీ వచ్చి ఆ గత రైటింగ్ కేస్ జరిగింది. దానికి...ఆ స్వాదీనాన్ని గురించి తగరారు పెట్టుకోవడంవల్ల కోర్టులో ఇంక తీర్పుకోసరం కాసుకొనుండారు. ఆ స్వాదీనము ఎవురికి ఉందీ...అని రికార్డు పూర్వకంగా సాక్ష్యం మూలకంగా తేత్తే వాల్లు ఒక కేసు నిలుస్తుంది. ఒక్కేసు తోసేస్తారు. అది ఇంపార్టెంటు...అట్లా గవుర్నమెంటు లేందూ బట్...ఎవురు స్వాదీనములో ఉంటే వాల్లుకి రైటుంటుంది, స్వాదీనం లేనోల్లకి రైటుండదు. అది గవుర్ మెంటుకీ, స్వాదీనంలో ఉండేవాళ్ళకి కావాల్సిన పేచీగానీ తర్డ్ పార్టీకుండే పేచీగాదు...మూడోపార్టీ ఎవరు స్వాదీనంలో లేరో మూడో పార్టీ గా ఉంటారు. మాకు స్వాదీనముందన్జెప్పి కర్ణం వొప్పుకొన్నేడు, రెడ్డి వొప్పుకొన్నేడు. వాల్లు హరిజన్సే గూడ వొప్పుకొన్నేరు మా స్వాదీనంలో ఉంది. మాకే కూలీకోస్తా ఉంటిమి మీకే ఆకు కొడ్తా ఉంటిమి వొప్పుకొన్నేరు. కాబట్టి ఈ సాక్ష్యాన్ని బట్టి ఈ కేసు మా స్వాదీనంలో ఉంది బూమి అన్జెప్పి రెడ్లకి తీర్మానం గావొచ్చు. అన్జెప్పి మేం ఆర్గ్యుమెంట్ జేస్సేం క్రిమినల్లోనే సర్ ఇదంతా రైటింగ్ యూస్డ్ వెపన్స్, డెడ్లీ వెపన్స్. కొట్టుకొన్నేరు. కత్తులు, కటార్లంత వాడ్ నేరు. గ్రీవియస్ ఇంజురీస్ ఎముకలు ఇరగడమూ, చేతులు ఇరగడము, కాల్లిరగడము...ఇదంత క్రిమినల్ కేస్. బట్ బూమిని గురించి క్రిమినల్ కేసొచ్చింది. భూమి తగరారు గురించి సివిల్ కేసు. దాన్నిగురించి...ఇప్పటికి వాల్లెవరూ సివిల్ కేసు దావా దాకల్ జేసొక్కల. సివిల్ కేస్లో కొట్టుకొనేదుండదు. భూమిని గురించి తగరారేమంత ఉందీ అన్జెప్పి వాల్లే ముందు సూట్ దాఖల్ జేసొక్కంటార్. అది సివిల్ కేసు. క్రిమినల్ కేస్లో నేరుగ కొట్టుకొంటారు. అది రైటింగ్ కేసనవుతుంది. దాంట్లో రెండు పార్టీలు సాచ్చెము మాది బూమి మాది బూమి యంటారు. అది...అది సాక్ష్యాన్ని బట్టి తీర్మానమయితుంది.

ఈ బలిజెపల్లెని ఒక పుంగునూర్ తాలూకాలో ఇక్కడికి పన్నెండు మైళ్ళో బలిజపల్లెని ఒక గ్రామం ఉంది. ఆ బలిజెపల్లెలో రెండు పార్టీల వాల్లు బలిజె కేస్టు పీపుల్లోనే రెండు పార్టీలు బలిజె కులంలో ఇద్దరు పెద్ద రైతులు పార్టీ పెట్టుకొని భూమి తగరారు గురించి చెంబకూడు అనే గ్రామం నుండి వస్తా ఉంటే ఇద్దర్ని బట్టుకొని వేరేపార్టీ...ఇంగోపార్టీ ఓ పదిమంది అక్కడ కాసుకొని బట్టుకోని వొకన్నాయన్ని గొంతుకోసినారు, వొకాయన్ని పట్టి, కొట్టి అక్కణ్ణే సంపేసనారు గ్రామం సమీపమున. సరే వాల్లక్కడ పడిపోయినారు. మబ్బురాత్రి. అందరూ ఎక్కడోల్లక్కడ పరిగెత్తినారు. మల్ల పోలీసు దావా యిచ్చినారు. ఆ పోలీసు దావా ప్రకా

రము కేసు సాక్షమంతా సేకరించి కోర్టులో దావా దాఖల్ జేసి పద్నాలుగు పదిహైదు మంది పైన ఛేర్జి కేసు మోపినారు. సరే ఆ కేస్లో ముద్దాయిలు ముద్దాయిలపైన బలమైన సాక్షెం లేదని తేలలేదని తోసేసినారు కేసు. అయితే న్యాయంగా చూస్తే ఇద్దరు డబుల్ మర్డరు ఇద్దరు చనిపోయుండె కేసు. ఎవురికయినా సింపతీ అంటే ప్రజల్లో మాత్రము సానుభూతుం టుందేగానీ కోర్టులో మాత్రం సాక్షం లేందే కేసుల్ నిలవ్వు. అదిగూడా వొక డబుల్ మర్డర్ కేసని బలిజేపల్లి డబుల్ మర్డర్ కేసని చాలా ఫేమస్ ఇంట్రెస్టింగ్ కేస్. అది టేకప్ జేసినా గాట్ ఎక్విటెడ్. డాక్టర్లు మిగత్తా ఐవిట్నెస్లు ఆ విలేజర్సు ఇంగ పోలీసు విట్నెసు అంత సాక్షెముంటారు, సాక్షెము రుజువుగాలేదని తోసేసినారు.

ఎగ్రికల్చర్ గురించి గూడా చెప్పమంటే గూడా చెప్తాను. ఈ మద్దెట నేను ఆగస్ట్ నెల్లో మామిడి చెట్లు పదెకరాలు పిట్స్ గుంతలు తీయించి ఈ దీపావళి పండిక్కి ముందురోజు ఏడువొందులు మామిడి చెట్లునాటించినాను. నాటిన మరుసటి దినమునుండి పదహైదు రోజులు వరసగా సైక్లోన్‌వల్ల మోడంబట్టి, తేమెక్కువుగా ఉందన్జెప్పి భయపడ్తా ఉంటే చెట్లన్నీ చచ్చి పోతాయని...ఇపుడు ఎండొచ్చింది ఈ మధ్య, ఈ వారం లోపుల ఆ ఎండవల్ల చెట్లు బాగా బతకతా ఉండై. ఇప్పటిక ఈ సవచ్చరం మేము మామిడి చెట్లకంతా మనుషుల్ని బెట్టి నీల్లు పోపిస్తే వారానికి రొండుసార్లు ఓ కుండ కుండ నీల్లు పోస్తే ఓ సంవచ్చరం కాపాడ్తే రేపు సంవత్సరం వర్షానికి మాన్లు పెద్దవైతయ్. మూడొవ సంవత్సరం పంట వస్తుంది. వో టెన్నేకర్స్ ఏసినాము సార్ మామిడిచెట్లు. ఇంగ నాల్గో సవచ్చరం నుండి పంట ఫల్ సాయం వస్తుంది; రైతుకి తొరలో ఆదాయమొచ్చే పంట ఇది. మామిడి చెట్లు. మిగ్తా ఏ పంట వాణిజ్జె పంటలకంటే ఇది కొంచెం అతి తొరలో పంటొచ్చే పంట ఇది. ఇది పెతిరైతు రొండెక్రాలు మూడెక్రాలుండేరైతు గూడా మామిడి చెట్లు బెట్టి వర్షాకాలంలో పంట జేస్కోవచ్చు.

# వ్యవహర్త-2 (స్త్రీ)

కేంద్రం : పుత్తూరు విద్య : బి.ఎ

వృత్తి : ఆఫీసు క్లర్క్, వయస్సు : 37 కులం : బ్రాహ్మణ

విషయం : ఉద్యోగినుల సాధక బాధకాలు, అభిప్రాయాలు

అలవాటు పడిపోయింది గదండి. పొద్దున్నే లేచి తెల్లవార్తే వంట జేస్కొంటాను. తర్వాత పిల్లలకు కార్యక్రమాన్నంతా చూస్కొంటాను. అదిగాకుండా ఫేమ్లీ సర్కమ్‌స్టెన్స్‌లో గూడ ఇద్దరూ భార్యాభర్తలిద్దరు జేబ్ జేస్తే అదే సుఖవంతంగా ఉంటుందనే ఉద్దేసెంతోటే...మామూలు రొటీన్ వర్క్‌లో అలవాటై పోయిందిగదా. పొద్దున్నే లేచి బయం బక్తులతో చేస్తూ ఉంటాను. ఇంకా తొందర్గ చేస్కొనేసి ఆఫీసుకు పోవాలనే ఉద్దేసెం చేత అలవాటు పడిపోయేను. అంటే ఒకోపారి విసుగ్గానే ఉంటుంది. క్రిటికల్‌గానే ఉంటుంది. అగ్రికల్చర్ డీల్ చేస్తూ ఉన్నాను. పల్లిగ్గా ఎక్టేచ్‌మెంటు. బిడివో దెగ్గర గూడ వొచ్చి కంప్లైంటు చేస్తా ఉంటారు. కానీ మనం పబ్లిక్ సర్వెంట్ గాబట్టి వాళ్ళకు నిదానంగ ఎట్లా లోను అప్లై చేసుకోవాల...

ఫస్ట్ ఇప్పుడు గవొర్నమెంట్లో స్టేట్ లెవల్ అయ్యార్ డీపి(I.R.D.P.) స్కీము ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్ ప్రోగ్రేమని పెట్టినారండీ. అది ఎట్లాగంటే స్మాల్ ఫార్మర్స్ మార్జినల్ ఫార్మర్స్‌ని ఉంటారు. అంటే విలేజి వైజ్‌గా వాడు బిడివో ఆఫీసు సరౌండింగ్స్ దీంట్లో లోన్స్ బేక్‌వర్డ్ ఎస్సీస్కు, బీసీస్కు ఎస్టీస్కు వాళ్ళకంత లోన్లు ఇవ్వాలనేటివి. దాంట్లో ఎట్లాగంటే మొట్టమొదట ఫస్టు ఎందర్కో ఇచ్చేస్తూ ఉంటారు. వాళ్ళకు ఫైవ్ ఏకర్సు బిలోఉంటే వాళ్ళకు సబ్సిడీలిస్తారు. లోను కోసమన్జెప్పని మొట్టమొదట అప్లికేషన్ బెట్టుకొంటే దాంట్లో బేంకు వాళ్ళ కన్‌సల్టివ్వాల. బేంకు వాళ్ళు కన్‌సల్టిచ్చిన తరాత ఈ అప్లికేషన్స్ ప్రాజెక్టాఫీసర్కు పంపిస్తే వాళ్ళు రికమెండ్‌జేసి పంపిస్తారు. తరాత సబ్సిడి - లోన్సుకు మేము ఎడ్జెస్టు జేస్తాము. కైండ్‌గానే ఇస్తామనమాట కేష్‌గా ఇవ్వరు. ఇప్పుడు బులక్కార్ట్సు తరవాత షీప్ యూనిట్స్, పౌల్ట్రీ యూనిట్స్ ఇవన్నీ వాళ్ళకు అనెంప్లాయిమెంట్ ప్రాబ్లమ్ సాల్వ్‌జేయటాని కోసరం ..

ఇవ్వరండి. అట్లా లేదు. వేరే ఖర్చు పెట్తారని జెప్పేసి జన్రల్‌గా అంటే ఈ డ్రాట్ రిలీఫ్ దీంట్లో ఉందన్మాట. అంటే కర్వు ప్రాంతానికి వాళ్ళ నీటి వసతుల కోసమనేసి, కాల్వలు దొవ్వించడము, భావులు తొవ్వించ

డము, వీటి కోసం రిలీజ్ చేస్తారు. రిలీజ్ చేస్తారు డబ్బు కాని కేష్‌గా ఇవ్వకుండా వాళ్ళకు బియ్యంగా...

ఇప్పు ట్రైసిజమ్ కింద అనెంప్లాయిమెంట్ స్కీమ్‌కింద ట్రైసిజమ్ అంటే ట్రైసిజమ్ మీన్స్ విలేజ్ ఇంప్రూవ్ జేయాలనుకొన్నారు. విలేజెస్లో కొంతమంది గ్రామీణులంతా గూడ కొంతమంది చదువుకొన్న లేడీసుంటారు కానీ వాళ్ళకేమీ ఫైనేన్షియల్గా అసిస్టెన్సేమి లేవు కాబట్టి వాళ్ళు కుట్టుపని నేర్చుకొంటారు. నేర్చుకొన్నందువల్ల బేంకు వాళ్ళు సబ్సిడీ ఇస్తారు. మిషన్లు తీసిస్తారు-ఆ పర్‌పస్‌కింద. తర్‌త ఎస్సెల్సీవర్కు చదువుకొన్నవాళ్ళు అనెంప్లాయిమెంట్‌గా ఇంట్లో ఉంటారు గాబట్టి వాళ్ళకే పౌల్ట్రీ యూనిట్స్‌కింద, తర్వాత ఈ కుమ్మరి వాళ్ళకు కుండలు తయార్ జేసేదానికి, బుట్టలు తయారు జేసిన వాళ్ళకు వాళ్ళకంతా గూడ ఫైనేన్షియల్ అసిస్టెన్స్ ఇస్తూ ఉంటుందన్మాట. స్కీమ్ బాగుందండి. సెవన్టీఎయిట్ నించి ఆరంబమైందండి మా స్కీము-అయ్యార్ డి పి స్కీమ్ కింద. కొంత వర్కు బాగనే స్కీమ్ ఇంప్లిమెంట్ అయిందనే చెప్పవచ్చు.

నలుగురు పిల్లలండి. బియెస్సీ ఫస్టియరు ఒకబ్బాయి, తర్‌త ఇంటర్ మిడియట్ ఫైనలియర్ ఒకమ్మాయి చదువుతాంది. సీనియర్ ఇంటర్ మిడియటు తర్‌త నైన్తుక్లాస్. ఇప్పుడే ఇంకో అబ్బాయి సిక్సుతు. అబ్బాయేనండి. గ్రూప్ ఎమ్‌పీసీయండి. ఎమ్‌పీసీయెంటె ఇప్పుడు మేత్స్ తీసుకొన్నాడు. ఇంజనీరింగ్ పోవాలని అ అబ్బాయి ఉద్దేసెము. కాని ఎమ్మెస్సి చదివిచ్చి కెమిస్ట్రీ తీస్కొంటె బాగుంటుంది.

ప్రాబ్లమ్సంటే నన్నడిగితే భార్యాభర్తలిద్దరు అర్థం జేస్కొనే దాంట్లో ఉందండి. లేకపోతే ఏ ప్రాబ్లమ్సేలేకుండ నన్నుజూస్తే జేబ్ చేసినందు వల్ల ఎంతో సుఖంగా ఉంటుందనే అనుకొంటాన్నేను ఏం ప్రాబ్లమ్సేమిఉండదు. అర్థం జేస్కొని ఇద్దరు సహకరించినారంటే దానికి మించిన సుఖం లేదని నా ఉద్దేసెము. లేదండీ ఒక రకంగా ఎతుకొంటే రొటీన్గా ఎత్కొంటే మనం సుఖంగానే ఉంటామనిపిస్తుంది. ఇహ అర్థం జేస్కొనేదాంట్లో ఉంది. అటు లేదండి. ఇద్దరూ బర్త భార్యకు సహకరించినదాంట్లో, కేవలం వంటజేసే దాంట్లోనే కాదూ, పిల్లలకు సమకూర్చే దాంట్లోగానీ సహాయం జేస్తే మాత్రం బాగా జర్గుతుందనే నా ఉద్దేసెం. అది రొటినై పోతుందండీ. రొటీనై పోతుంది. ఏం లేదండి. మన మనసుకు సంతోషంగా జేస్కోవాలనుకొంటే విసుగు పుట్టదు. అంతా మన్లోనే ఉందన్మాట. విసుగు కోపం మనం తెచ్చుకొంటే వస్తుంది గానీ మన బడిషెత్తు ప్రకారం ఎడ్జెస్టు చేస్కొంటే మనకు సంతోషంగా ఉంట్టుంది. నా ఉదేసెంలో నా సర్వీస్లో, నా ఇన్నేళ్ళ సర్వీస్లో చూస్కొంటే గూడ ఇద్దరు సహకరించినామంటే దాంట్లో ఏ ప్రాబ్లమ్సేలు

రావు. సహకారమంటే ఏ ముందండి? పొద్దున్నేవంట జేస్తామనోండి, పిల్లల్కి వొకలవాటుగా తల్లి కష్టపడ్తుందనేటి ఒక భావం వాళ్ళకు చిన్నప్పట్నించి నేర్పిస్తే వాళ్ళ సహకారంతో గూడ మనం పన్ జేస్కొంటుంటే అమ్మ కష్టపడొస్తాంది గదాని పిలకాయలు కూడా ఒక భావం ఉంటుంది గదా? భర్తకూ అంతే భార్య విసుక్కొని వస్తుంది గదా అన్ జెప్పేని భార్య మీద అధికారంగా చెలాయించకుండా సహకరించి నారంటే ఇంక దాన్కి మించనది లేదు. లేదండీ. ఇప్పుడు గూడా మా అత్తగారున్నార్ గదా! అంటే ఒకరకంగా ఎత్తుకొంటే సొంత మేనరికంగా తీస్కొన్నా మనోండీ, కానీ ఎప్పుడు గూడా సాధార్ణంగా ఎత్కొంటే భార్యా భర్తలు అర్థం జేస్కొంటే దానికే ప్రాబ్లమ్స్ రాదని నా ఉద్దేసెము, రొండోది రెచ్చగొట్టకుండా వాళ్ళు వాళ్ళ భర్త ఎట్లజెప్తె అలా అర్థం చేస్కోవటం, భార్య కష్టసుఖాలు అర్థం జేస్కోవటం అంటే జాబ్ జేసేవాళ్ళవల వాళ్ళ ఉజ్జోగంలో ఉండే సాదక బాధకాలు ఇద్దరు అర్థం జేస్కోవటన్నాట. దాన్ని బట్టే వాళ్ళకు ఏ ప్రాబ్లమ్స్ ఉండదని నా యొక్క ఒపీనియన్.

అదేనండి...భర్త ఇప్డు ఎవర్తోనన్న మాట్లాడుతున్నాడనుకోండి. భార్య దాన్ని పెడర్థంగా తీస్కోకూడ్దు. అదే మాదిరి భార్య గూడా అపార్థాలు జేస్కోకుండా ఉన్నంత వర్కు సుఖవంతంగా జర్గుతుంది. లేకపోతే ఇక అపార్థాల్తోనే జీవితాంత్రం వాళ్ళ వాళ్ళ చేతుల్తోనే నాసెనం జేస్కొంటారన్నాట. ఇప్డు మేమంటే సొంతమనోండి. బందుత్వంలో కలిసింది. బంధుత్వం లేకపోయినా గూడా ఇద్దరు ప్రతి ఒక్కటి రహస్యమంటూ లేకుండా బార్యాభర్తలకు ఇది లేకుండా ఉంటే అదె జెన్రల్గా ఒపీనియను అదే అధికారం చెలాయిస్తేనే ఇట్లాంటి ఆ భావన రాకూడదన్నాట. ఉంటుందండీ ప్రాబ్లమ్స్ ఉంది. ఇపుడు ఆర్థికంగా ఎత్తుకుంటే...చెప్తాను. ఆర్తిక బాధలు పడేదాని కన్నాగూడా ఉజ్జోగంలో కష్టపడ్తె నెల భచ్చేంగానే జీతమొస్తుంది. మన ప్రాబ్లమ్సంతా సాల్వ్ జేస్కోవొచ్చు. పిల్లలు పెంపకమనోండి. మనం జేసే అలవాట్లోనే వొస్తుంది గదా.

ఏముందండీ? అమ్మాయిలు గూడా జాబ్ చేయిచ్చాలా అనుకున్నాను. అర్థంజేస్కున్న వాళ్ళు వస్తేనే...వాళ్ళిద్దరు...మనల్ని ప్రాబ్లమ్స్ క్రియేట్ చేయకుండా వాళ్ళు వాళ్ళ అర్థం జేస్కుంటారనే జెప్పనేసే మేరేజ్ చేయాలనుకొన్నాను. అంటే ఎదన్నా ఒక ఎజుకేషనల్గా ఒక క్వాలిఫికేషన్ జేస్తే ఏదైనా జేబ్ చేపిచ్చాలా అని వొక నా ఉద్దేసెం. అంతేనండి. అంటే ఫ్యూచెర్ మనం చెప్పలేం గదండీ. అందువల్ల ఆడపిల్లకు వొక క్వాలిఫై అయింతర్వాత వొక జేబ్లో చేరిం తర్వాత సర్టెన్ ఏజ్లోనే...వొక నైంటీన్ ఇయర్స్లోనే మేరేజ్జేస్తే బావుంటుందని నా ఉద్దేసెం.

మైత్రికం లేదనుకోండి. కొంత వరకు రిలేషన్స్‌లో జేస్కొంటే మంచిదేండి. కానీ పిల్లలయొక్క అభిప్రాయాన్ని బట్టి ఇప్పు మేరేజి చేయాలి గదా! కొంతమందికి నచ్చక పోవొచ్చు. అట్ల...వాళ్ళ పిల్లలయొక్క అభిప్రాయాన్ని బట్టి పరాయ్ సంబంధమైన, సొంతమైన చేయవాలని నాఅభిప్రాయం. ఏదయినా పర్వాలేదు. అర్థం జేస్కొనే దాంట్లో ఉందండి. అంటే-మేరేజ్ కంతా నూరేళ్ళపంట గదా. వొకసారి ఇపుడేదన్నా అంగట్లో వొస్తువు గాదు గదా మార్ట్ గేజ్ జేసేదానికి. అందువల్ల వాళ్ళభిప్రాయాన్ని బట్టి చేయవాలని నా ఉద్దేసెం.

వొస్తే మాత్రం ఆమోదిస్తానండి, మనం అర్థం జేస్కొనే దాంట్లో ఉందండి, అంటే మేమ్ చూస్తామండి. చూసి మంచి చెడ్డలుచూసి నిర్ణయించేది మేమన్నమాట. అంటే తొందరగ్గ రాము కాని అభిప్రాయనికెతూ కొంటే కుల మత భేదాలు లేదు అనే ఉద్దేసెంతో చెప్తున్నానే గానీ తాను చెప్పింది చేయ వాలని యొకుద్దేసెంలేదు. దాంట్లో కష్టసుఖాలంతా చూసి కన్విన్స్ చేసి చేయ గల్గుతా మన్‌మాట. అదే నండి వాళ్ళయొక్క మంచి చెడ్డలు విచారిస్తాం గదా మనం. వాళ్ళ యొక్క కష్ట సుఖాల్గానీ వాళ్ళ మొక్క పుట్టు పూర్వోత్తరాలు గానీ మనం విచారిస్తాం గదా...కేవలం వాళ్ళు లవ్ జేస్నంత మాత్రాన మనం చెయ్యం గదా! అట్లయినా పాటింపు లేకుండా ఇతన్నే చేస్కోవాలనే ఉద్దేసెం చేత బలవంతం పెళ్ళిళ్ళు మాత్రం చెయ్‌ను.

అయిందండి, కాళాస్త్రి...రీసెంటుగా...అయింది "లాష్టియరు" సెన్‌మంత్సఉంటిని. మాహస్బెండ్ నేను ఇద్దరం ఒకే ఆఫీస్లో యేస్కొన్నాము.

ఎలెక్షన్ అంటే ఇపుడూ సమితీవైజ్ గా విలే జెసంతా ఉంటుంది గదండి. దాంట్లో జోనల్స్ వైజ్‌గా ప్రిపేర్ జేస్తాము, వాళ్ళ వాళ్ళ మెంబర్స్ బట్టి వాళ్ళ వాళ్ళ బూత్ ఏర్పాట్ జేస్తాము. వాళ్ళకు అపాయింట్ మెంట్ ఆర్డర్స్ మేమే ఇచ్చేది. ఎలక్షన్ మెటీరి యల్సంతా వాళ్ళకు హేండోవర్ చేస్తాము. తర్వాత ఆఫీసర్స్‌ను తర్‌త ఎలెక్షన్ క్లాసస్‌ను కండక్ట్ చేయడము, ఇదంతా ఎలెక్షన్‌డ్యూటీ సంతా గవర్నమెంటంతాని డబ్బు రిలీజ్ చేస్తుంది సమితికి. ఆ డబ్బును బి. డీ. వో. యుటిలైజ్ జేసి కండక్ట్ చేస్తారు.

రెస్పాన్సిబిలెటీగా ఉంటుందండి అంటే...మేము...పి.వో. స్ గా వేస్తారు. అంటే ప్రిసైడింగాఫీసరు ఎ.పి.వో. గారు ఉంచుతారు. అంటే రెస్పాన్సిబుల్టీ కానీ మనం స్ట్రిక్టుగా ఉంటానికి లేదు. ఆ యొక్క సిట్యుయేషన్ బట్టి కొన్ని కొన్ని పోవాల్సొస్తుందన్మాట. ఇప్పుడు బ్లైండర్ వోటర్ వొస్తారు. కానీ అతను బ్లైండరో లేదో మనకు తెలియదు. కానీ అతను నటిస్తారన్మాట. కానీ అతను నటిచ్చేటప్పుడు చుట్టుపక్కల ఉండేవాళ్ళు అతను బ్లైండర్ కాదూ అంటారు...కాదతను బ్లైండర్ కాదు అనంటాడు...

మనం అట్వంటప్పుడు అపోజిషన్ పార్టీను కన్‌ఫ్యూజ్ చేసి కన్విన్స్ జేసే దాంట్లో ఉందండి...మనం వాళ్ళని రెచ్చగొడ్తే మాత్రము ప్రాబ్లమ్ సాల్వ గాదనమాట. వాళ్ళను పిల్చుకోబోయి వాళ్ళు ఎవరైతే వాళ్ళకు...వాళ్ళ పోలింగ్ ఏజెంట్సొస్తారు, వాళ్ళ తర్ఫున ఏజెంటొస్తారన్మాట. వాళ్ళను పిల్చుకొని పంపిచ్చి ఆ...బ్లైండర్తోపాటు పంపిచ్చి...చేస్తాము...అవునండి. కానీ మనం చేసేదాంట్లో గూడ కొన్నుంది గదండి. శాంతియుతంగా పరి ష్కారం జేస్కొంటాం.

వాళ్ళు వృద్ధిలో కొచ్చి...వాళ్ళు వాళ్ళ ఫ్లేమీస్ వర్క్ బావుందనీ అంటె మనకు అంతకు మించిన సతొష మేముందండి. కానీ భాధనేది మనం క్రియేట్ జేస్కొనే కొద్ది బాధలొం ఉంటుంది. మనం దాన్ని సాల్వస్తూ జేస్తుంటూ...మనకు తృప్తిగా ఉంటే జీవితం ఎంతైనా సుఖవంతంగా చేస్కో వచ్చొ అనినా ఉద్దేసెమన్మాట. నాకూ ప్రాబ్లమ్స రాకుండాపోదు. కానీ నేను ఆలోచెన జేస్కొని ఒకోక్కక టప్పుడు ధృడత్వంతో దీనికి మించి మనకంటె తక్కువగా ఉండే వాళ్ళతో పోల్చుకోవాల్గదా అనే ఉద్దేసెం చేత నేను అను కొంటూ ఉంటాను. ఒకోటప్పుడు. మాకూ పిస్గు, కోపం వస్తూ ఉంటుంది. కానీ పిల్లలు మాత్రం అర్థం జెస్కొనేసి పోతూ ఉంటారు.

## వ్యవహర్త : 3

కేంద్రం : చిత్తూరు　　　విద్య : బి. కామ్ మొదటి సం॥

వృత్తి : విద్యార్థి. వయసు: 20　　　కులం : రెడ్డి.

విషయం : అనుభవాలు, అభిప్రాయాలు మొ॥నవి.

కాలేజీ పోతాము, పోయినామంటే అక్కడ ఎదో కొంతమందుంటారు. కొంతమంది ప్రెజెంటేస్కొంటానే క్లాసునుంచి ఎళ్ళిపోతారు. అంటే కొంత మంది కింట్రెస్టుండదు. ఏదో గలాట్ జేస్తామని వస్తార్ కాలేజికి, ఏదో లేడీస్ నట్ల చూస్తారు...మల్ల ఇంట్రెస్టు లేక పోతే ఎళ్ళిపోతా ఉంటారు. మల్లా అవర్లై పోతానే మల్లా వస్తారు క్లాసులోకి. ప్రెజెంటేస్కొంటానే మల్లా వరండాలో తిరుకొంటా ఉంటారు. అదంతా ఏమ్ లేదు. మేమేదో క్లాస్కు పోతం. క్లాసుంటే అక్కడుంటాము. క్లాస్‌గాని లేకపోతే ఇంటికొచ్చేస్తాము. లెక్చరర్స్‌ని గలాట్ చేస్తారొచ్చి. జరిగినియ్. ఇపుడు మామూలు తెలుగు లెక్చర్‌నుకో. ఆయనేదన్నా తెలుగులో ఏదన్నా తెలుగు లెసన్ చెప్తాఉంటాడు. ఏదన్నా కొంచెం ఇదిగా...ఉంటే గలీజ్‌గా అట్లాటప్పుడు ఇట్లా అదెందుకు ఇదెందుకు ఏదన్నా కొంచెం గలీజ్‌గా వచ్చినాయింటే అదేంసార్ యిదేం సార్ అడగ్తారు. గలీజ్‌గా చెప్పిచ్చేటట్టు చేసేది. ఆడవాళ్ళని...పోతా ఉండారనో వాళ్ళకేదన్నా నిక్‌నేమ్ పెట్టింటారు. దాన్ని వాళ ఎనిక్క పోతాఉంటే వాళ్ళనసేది. ఏదో ఒకరు వాళ్‌కి ఏదోఏదో పేరు పెట్టింటారనో ఎనక అంటా ఉండేది వాళ్ళని.

ఎమ్‌కామ్ చేయాల. జాబో లేక వెవసాయమో చేయొచ్చు. నా అయిడ్యా అంతే. బిజినెస్సన్నా ఏదన్నా చేస్కొందామని. చదువుకోవాల ముఖ్యంగా. ఈ కాలంలో చదవ్‌కోకపోతే వేల్యూ ఎక్కడుంది? పెతో క్కరు చదువ్‌కోవాల. చదువుకొన్నొంక మళ్ తర్వాత జాబ్ దొర్కితే మనం ఇష్టమైతే పోయేది లేకపోతే పిస్టేజ్‌కోసం చదువ్‌కోవాల. ప్రతో క్కరు చదువ్‌కొంటార్ ఈ కాలంలో. చదువ్‌కొన్నోనికేగదా గౌరవము. అందుకని దానికోసమే చదువు...

అందురు తీస్కొంటే మనం తీస్కోవాల్సిందే గదా. మా ఉద్దేసెం తీస్కోవాల్సిందే. ఇవుడు చెల్లెలిద్దరుండార్ గదా. వాళ్ళకు వాళ్ళు తీస్కోపోతే మేం తీస్కోము. వాళ్ళకిద్దర్కి పెళ్ళిజేయాలంటే మేం తీస్కొంటేనే గదా. మేమ్ తీస్కోకపోయినామనో...మాకుండేది

వాళ్ళదై పోతుంది. అప్డు మేమేం చేసేది? ఇంగ ఉజ్జోగాలే దొర్కవు. ఈ కాలము. వాళ్ళు తీసోక్కకపోతే మేమూ తీసోక్కము. జెన్రల్గా తీసోక్క గూడ్దు. అందురూ ఆ మాద్రి చేస్నారంటే మనమూ తీసోక్కగూడ్దు. ఒక డిట్లా ఉండి ఒకడిట్లాఉండి...ఏం...

మా ఫేమ్లీలో మా ఫాదరొచ్చి వెవసాయం జేస్తుంటారు. మల్లా బిజినెస్ చేస్తా ఉంటారు. బిజినెస్సంటే షుగరూ, ఇది డీలర్గా ఉంటాడు, షుగర్ డీలరూ...అదిచూస్తా ఉంటాడు. మా వూర్లో రైస్మిల్లొకటుంది. దాన్కి మేనేజ్మెంట్ జేస్తారు. తియేటర్ ఒకటుండింది. అది ఇప్డు పార్ట్నర్స్ కొంచెం యిదిగా ఉంటే మూసేసినారు. మల్లా కొనుకొన్నేం అంతా పార్ట్నర్స్. ఇంకా టూమంత్సులో త్రీ మంత్సులో స్టార్ట్ చేస్తాం. బెల్లం చేస్తాం మామూల్గా. మా సైడంతా బెల్లమే. తెల్సు. ఏది బెల్లమా? ఫస్టో చెర్కు నాట్తారు. మల్లా మామూల్గా వీక్లి వొన్సైమ్ దాన్కి వాటర్ సప్లై చేస్తారు. చేస్నంక వొక నైన్మంత్స్ టెన్ మంత్స్ మల్ల దాన్ని కట్చేస్తారు. కట్చేసి క్రషర్లో వేసి ఆపాల్ తీసోక్కపోయి పెద్ద బేర్లమాదిరుంటై. దాంట్లోపోసి కాంచి మురికంత ఎత్తేసి బెల్లంచేస్తారు. మేం చెయ్యేం. చేస్తా ఉంటార్గదా చూస్తాం. తెలుస్తుందిగదా...మనంగూడచేయాలనుకొంటే చేస్తాం. మనుషులంటే...ముద్దలుపడ్తారు గుడ్డల్లోపెట్టి. అప్పు మండీలో ఇస్తా ఉండారు కావాలంటే. వాళ్ళు కమీషన్ ఏజెంట్స్.

మామూల్గ ఫోర్పర్సెంటుంటుంది. మండీవాల్లు...మనం బెల్లం తోల్నేమంటె ఫోర్ పర్సెంట్ కమీషన్ తీస్కాంటారాళ్ళు. మామూల్గంటె టూ అన్ డాఫ్ పర్సెంట్ తీస్కాంటారు. మామూల్గ తోలేవాళ్ళిబట్టి. అప్పు మనం తీసుకొన్నామంటే ఫోర్ పర్సెంటు; మామూల్గ మనకావాల్సినప్డు డబ్బు తీస్కాంటాము. మల్ల బెల్లం తోల్నాక వాళ్ళు ఆ డబ్బు పట్టుకొంటారు. డబ్బు లేపట్టుకొంటారు. వొచ్చిన డబ్బులో కొంతబట్టుకొంటారు. వాళ్ళకే తోలాల. ఆరోజు మనం ఎప్పుడు తోల్నేమో ఆ రేటు పట్టుకొని కమీషన్ తీస్కాంటారు. మనకు అయిదువేలు గావాలన్నా పద్వేలు గావాలన్నా మన ఇది బెల్లంబట్టి ఇస్తారు. లాభమనే చెప్పాలండి. ఈకాలంలో బేంకులో ఇవ్వాలంటే బేంకులు మనకెప్పుడు కావాల్సినప్పు ఎక్కడిస్తారు? వంద రూపాయలు ఎరువుకావాల...ఎర్వులు వెయ్యాల...వీళ్ళప్డు...లోన్ అప్లైచేసినామంటే వాళ్ళు ఇచ్చేళకి పంటైపోయుంటుంది. అదే పండదువాళ్ళో ఆదారపడినామంటే. సొసైటీలో ఇస్తారు. అంత...పంటంత అయిపోయినాక యిస్తారు.. అప్డు ఇదే బెల్లమైతే మనక్కావల్సినప్డు...ఎర్వులకి కొంత మంది డీలర్షిప్ పెట్కొంటారు. లెక్కరాస్కుంటారు, మనకు సమయానికి ఎపుడు కావాలన్న ఏ కర్చుక్కావాలన్న గూడ ఇస్తారు. కాబట్టి ఎట్ల తిర్గి తీయాల్సిందె. ఎంత డబ్బులుండే వాళ్ళుగూడ సామాన్నెంగ మండీవాళ్ళ

దెగ్గతీస్తారు. కమీషన్ వొన్నండాఫ్ పర్సెంట్ గదా ఇస్తాం ఎక్కువ. మనం ఇంగా వొన్నియర్దాకా పెట్టుకోవచ్చు. డబ్బుల్ తీస్కొంటాము... ఇఫ్డు మేమే అన్కో ఇఫ్డు డబ్బుల్ తీస్కొంటాం కావాలంటే...ఇఫ్డు పోయిన లాస్టియర్ చేసిన బెల్లం ఇంగా అట్లాపెట్టుకొన్నాం. వొన్నియర్గాదు మనిస్టము. ఎట్లయినా పెట్టుకోవచ్చు మన స్తోమతబట్టి. వాళ్ళకేతోలాలి. అక్కణ్ణే తోల్తాము. ఎక్కడ తోల్నా వాళ్ళు కమీషన్ బట్టుకొంటారు. వొప్పుకోరు. బెల్లం వాళ్ళు తీయ్రు మామూల్గ. దానిక్కొంత మందుం టారు వేపారస్తులు. భాంబేనుంచి వస్తారు. రోజొచ్చి వేలం బాడ్తారక్కడ అందురు. వాళ్ళకిష్టమైతె ఇచ్చేస్తారు. మనకు...ఇంతరేపైతే ఇచ్చేయ మంటె ఇచ్చేస్తారు. అట్లే పెట్టండీ అంటె పెడ్తారు.

మేరేజ్ ఎమ్‌కామ్ చదివినాక జేస్కొంటాను. చదువుకొన్నమ్మాయినే చేస్కొవల అంటే మనం ఎమ్‌కామ్ చదివినోళ్ళు ఎమ్‌కామ్ చేస్కొమన్లేదు. ఎదో బియ్యే...న్న డిగ్రీ అన్న ఉండాల్గద. ఇంటర్‌మిడియట్ లెవల్లో...న్న తీస్కొంటె తీస్కొచ్చు. తీస్కోపోయినా పర్వాలై. మనకేం లేదు. మనకు అమ్మాయి నచ్చాల అంతే. అదిగూడ వొక విషయం చెప్పాలంటె చేస్కో ల్సిందే గద పెద్దోళ్ళు చెప్పింది. అదంతేమిలేదు.

బియ్యేలో బీయీడీ కోర్సు పెట్టాలని...లాస్టియరు అడిగినారు. నిరా హారదీక్షంటే వాళ్ళు కలెట్టరొచ్చి ప్రామిస్ జేస్నాడు. ఈ మాద్రి మీకు నెక్ష్టియర్ పెడ్తారు...ఓపెన్ చేస్తాము. ఈ రొండు కోర్సులు మీరింగ నిలిపే యండని...ఈ ఇయరు వాళ్ళేంపెల్లేదు. అందుకని ఈ ఇయరు మల్ల స్టార్ట్ చేస్నారు. ఫష్టోవచ్చి నిరాహారదీక్ష చేసినారు. రిలే నిరాహారదీక్ష. ఒక సెవెన్ డేస్ చేసినాక మల్ల తర్వాత బంద్ చేపిచ్చినారు. అన్ని పూర్తిగ అంగళ్ళు, మొత్తం ఏ బిజినెస్సుగాని ఏమ్ లేకుండ చేస్నారు. చేలామంది ఇబ్బంది పడినారు. ముందే ఎనౌన్స్‌చేసినారు. గవోర్నమెంటు ఎట్లముందుకొస్తుంది. మనం సైలెంట్‌గా నిరాహారదీక్ష చేస్కుంటా ఉంటే? ఏదోఒక్కటి గవోర్న మెంటుకు నష్టం గలిగిస్తేనేగద వారు ముందుకొస్తారు? బస్సులో టూటేక్స నష్టమూ రోజుకు డైలీ టూ టేక్స...యింక సినిమా టాకీస్లో వచ్చి వొక తర్టీ తౌవజెండ్స దాకా టేక్స వస్తుంది. అదీ లాస్సూ...యింగ మన బిజి నెస్సులో యింగా అంతా ఉందిగదా.

అంటె తిరుపతోళ్ళు యిక్కడకొచ్చినారు. ఇక్కడ పోలీసోల్లుకొట్టి దిగ్తే...టెన్ మెంబర్సు, టొంటీ మెంబర్సు...వాళ్ని లాటీచార్జి చేస్నారు. అక్కడ రొండొందల మందిని అరెస్టు జేస్నారు స్టేషన్లోనే...రైల్వే స్టేషన్లోనే.

ఇప్పుడు మామూల్గ డైలీ టెనోక్లాక్ వర్కు చదువుతాము. ఎగ్జామ్‌లో

స్వెల్వు...రాజెకీయాలంత స్వార్ధంగానే ఉండాయి. అవసరమేగాని... రొండు పార్టీలుండాలి. ఈ మాదిరి అన్ని పార్టీలుండకూడ్దు. అమెరికాలో మాద్రి డబుల్ పార్టి ఉండాలి. ఒక్కొక్క పార్టీలోనే పదిమంది...పది రకాల్గా ఉంటే బావుండదు. రొండు పార్టీలుంటే ఇప్డు అపోజిషన్ పార్టీఅడిగే దానికి బావుంటుంది. ఇది ఏమీ అంటే ఈ రోజుంటే రేపుండదు. ఈరోజున్న పార్టీ మల్ల రేపు చీలికై పోతుంది. కాబట్టి రొండు పార్టీలుంటే ఇద్దురు అడిగే దాన్కి ఒకరు తప్పు చేస్నాగూడా రూలింగ్లోఉండే పార్టీని ఇంగో పార్టీ అడిగే దానికి ఉంది. ఇపుడు యెట్లా లేదు. రూలింగ్ పార్టీ గూడ ఉంటామా ఈరోజు ఉంటామా రేపుంటామా. వాల్లు చేసేదాన్కి లేదు ఏమీలే. రొండు పార్టీలుంటే మంచిది. డిక్టేటర్షిప్పుంటే నియంతృత్వంగా ఉంటుంది మల్ల. దేసెంలో వాళ్ళు చెప్పినట్లే...

ధర్లు పెర్గుతా ఉండై. అన్ని ఫేక్టరీలకు సంబందించిన వాటికి మాత్రం పెరుగుతూ ఉండై. వెవసాయం చేసే వాళ్ళకు మాత్రం ఏం ధర్లు పెరగలేదు. వాళ్ళేమొ అట్లే ఉండారు.

మమ్మల్ను ఒకసారి తెల్గు లెచ్చరరు ఈ పాయింటడిగినారు జెన్రల్ ఎస్సేగా. అందురు పిల్లోళ్ళు ఒక్కొక్కరు అందురు ఒద్దు ఒద్దూ రిజర్వేషన్ పెట్టగూడ్దూ రిజర్వేషన్ బెడ్తే మార్కులువచ్చే పెట్టండి. అందర్కి రిజర్వేషన్ బెడ్తే అందురు డబ్బులుండేవాళ్ళే ఉండరు, ఎవ్రో కొంతమంది ఏదో ఉంటారు. హరిజెన్లు మాద్రి మార్కులొచ్చేవాళ్ళకి పెట్టండి రిజర్వేషను అట్లని అందురు పిల్లోళ్ళు చెప్పినారు. అంద్లో చేలా మంది చెపినారు. హరిజెన్స్ అడగలేదు వాళ్ని, ఉన్నార్గానీ వాళ్ళేం చెప్లేదు. ఇప్డు రిజర్వేషన్ బెడ్తే డాక్టర్లు అంతా వాళ్ళేగదా. రిజర్వేషన్ హరిజెనులే ఉంటారు. వాళ్ళకే ముప్పైఅయిదు మార్కులొచ్చినా రిజర్వేషన్లో వాళ్ళకి సీటు ఇంజనీర్గా ఇస్తారు. వాళ్ళు గట్టే బ్రిడ్జి లెక్కడ నిలుస్తాయి? డాక్టర్ గా ఉంటే వాడు ట్రీట్ మెంట్ జేస్తే యెక్కడన్నా బతకతాడా? ఏ ఆప్రేషన్ జేస్నా అట్లానే ఉంటుంది. తెలివైనోళ్ళు ఉండేవాళ్ళు...వాళ్ళకి ఏమీ లేకుండ ప్రోచ్చాహం లేకుండగ తెల్వలేనోళ్ళకిస్తా ఉండారు. అట్లనిగాదు. ముప్పై ఐదు మార్కులే గద ఒస్తాండాది? వాళ్ళలో గూడ నైన్టీ ఎయిటీ పర్సెంటుండే వాళ్ళకిస్తే పర్వాలేదు. వాళ్ళకేం చదువ్ లేకుండా అయిదు మార్లు ఆర్ మార్లు ఫెయిలైనోళ్ళగ్గూడ ఇస్తా ఉండారు. వీళ్ళు నైన్టీ పర్సెంటు తెచ్చి నోళ్ళగ్గూడ సీట్లేదు. వాళ్ళకు... రోజుకు...వెవసాయంలో కూలీ చేస్తార్ గదా...ఐదురూపాయిలొస్తే నాల్రూపాయిల్ తాగేస్తారు. మిగిలినోళ్ళు...మేము ఇప్డు ఇంతా ఇర్వై ముప్పై బండ్లు బెల్లమెత్తి నలభై వేలు యాభై వేలు ఆదాయమొస్తేగూడ వారానొక సిన్మాపోయేదాన్కి గూడ ఇంట్లో కస్టంగుంటుంది. మనం ఇంగెట్ల రేప్టికి ఏమీ అని ఆలోచిస్తాము.

వాళ్ళేమంటే ఐదురూపాయిలొచ్చిందా...అంతే ఐద్రూపాయిల్ ఆ రోజ్‌కి కర్చు చేసేస్తారు. రేపొస్తారు మనింట్లోకి. వాళ్ళేం కూలీగూడ చేయ్‌రు. మాకై దురూపాయల్ కావాల, పద్రూపాయల్ కావాలా సినిమాకు పోవాల చిత్తూర్కు పోవాలంటారు. వాళ్ళు తీసొక్కంటార్. మనదెగ్గరేం ఆరోజుం డదు...మనం అప్పుచేసన్నగుడ వాళ్ళకి పదిరూపాయల్ ఇస్తాం. ఇవ్వకపోతే రేపు కూలికిరారు. వాళ్ళేం రేపనే గురించి ఆలోచించేదేలేదు. మనం రేపు అని మన దీన్నిబట్టి గౌర్వంగ ఉండాలని మనం...వాదిస్తాం. వాళ్ళామాద్రి చేసే వాళ్ళు మిగుల్తార్ గదా! అంటే హాస్టళ్లో చదివేవాళ్ళు మాత్రం పిల్లోళ్ళు నైంటీపర్సెంటు ఎక్కువ డైలి సిన్మా. వాళ్ళకేం? నైంటీరుపీసేమో ఇస్తారంట పాకట్ మనీ. ప్రెతిరోజు పోతాఉంటారు సిన్మా. వాళ్ళు చద్వేదిలే. ఎమ్లే. వాళ్ళకు ఎట్లా ఇంటర్ మిడియట్ చదిత్తగూడా వాళ్ళకి జేబొస్తుంది గదా. వాళ్లకు అందుకు పట్టిచ్చుకొనేదిలే. వాళ్ళకు ఫెయిలైనా అయినా ఏదో పోలీసయినా ఇస్తార్గదా! కాబట్టి వాళ్ళేం పట్టిచ్చుకొనేదిలే. ఎప్పుడు సినిమాలు అట్ల తిరిగేదానికి గుడ్డలు గిడ్డలు మనకు డబ్బులుండే వాళ్లకన్న వాళ్ళు ఫుల్లుగా కర్చుబెడ్తారు.

ఉజ్జోగాలు దొరకేదిలేదు. చద్వే ఇంట్రెస్టు తగ్‌పోతాఉంది పిల్లోళ్ళకు. చదువుకు సంబంధం ఉంటేనే...ఉజ్జోగం ఉంటే వాళ్ళింట్రెస్టుగా చదువ్‌తారు. లేకపోతే ఏదో కాలేజ్‌కి పోయినామా...అని ఇదే అందుకే గలాటలు ఎక్కువ యేది ఇదే కారణం. మా లెక్చెరర్సు గూడా ఇదే చెప్తా ఉంటారు. మా లెక్చరర్సు గూడా కొంతమంది అంటా ఉంటారు. ఈ మాదిరి నిరుజ్జోగం వల్లనే ఈ మాద్రి పిల్లోల్లు చెడిపోయేదానికి ముక్యంగ కారణమని. ఎందుకంటే కొంతమంది డబ్బులుండే వాళ్ళలా ఉంటార్గదా! వాళ్ళకు చదువు ఇంపార్టెంట్ ఉండదు. వస్తారు కాలేజికి. చద్వినా ఉజ్జోగ ముండదుగదా! కాబట్టి వాళ్లు గలాట చేస్తార్ వచ్చి. ఏదోక్కి చద్వాల కాలచ్చేపం. ఈ...ట్వొంటిత్రియెర్స్‌వర్కు అట్లా ఉండిపోవాల. మల్ల మేరేజ్ చేస్నాక మల్లా ఏదో వైపారమేదో చేస్కుంటార్. ఆవేళ వర్కు... ఏదో తిర్కుకొంటా ఉంటారు. మార్కులేదో...జెస్ట్‌పాసైతే చాలు, ఫస్టొచ్చినా ఉజ్జోగం రాద్‌గదా. అందుకని నిరాశ్‌తో అందుకని చదివేదిలేదు ఏమిత్లే. లెక్చెరర్స్ గూడా అందరూ ఇదే జెప్తారు. ముక్యంగ ఈ గలాటా లొచ్చేదాన్కి కారణం ఇదే. ఉజ్జోగాల్ లేదుగాబట్టి వాళ్ళ కింట్రెస్టులేద్ పిల్లోళ్ళకి.

పెళ్ళిజేస్కొని ప్రేమించేదే మంచిది, ప్రేమి చకుండా పెద్దోళ్లు వాళ్ళ ఎటూ ఇంట్లో ఎట్లుంది పరిస్తితి ఏంది అంతా విచేరిచుకొని చేస్తారు. అన్ని చూసే గదా చేస్తారు? కేరెక్టర్ చూస్తార్గదా? మా ల్గ వేమంత ఎట్లంటే...

మామూల్గ చూస్తారు...చూసి నచ్చినంక మాట్లాడ్తారు. ముందు కేరెక్టర్ ప్రాధాన్యతిస్తారు. అమ్మా నాన్న చూస్తారు. వాళ్ళింట్లో ఎట్లుంది, అంతా చూస్తార్గదా...అట్లాటప్పుడు బాగలేకుండా ఎట్లపోతుంది? నైంటీపర్సెంటు బాగనే ఉంటుంది, టెన్‌పర్సెంటు ఇంగ అన్నింట్లోనూ ఉంటుంది. ఇది ప్రేమించుకోనేదుంటే ఎవుర్నో ప్రేమించేస్తారు...బాగుంటేచాలు. మిగ్తా వాళ్ళెట్లున్నీ, వాళ్ళింట్లో వాళ్ళెట్లున్నీ అదంతా చూడ్రూ. హాయిగెట్లుంటారువాళ్ళు? అమ్మాయి బాగా లే కియర్ఫ్‌గా ఉన్నారనో...వీడేం బీదోడ్గా ఉండాడనో. ఈమె ఈ ఇంట్లోకొస్తె ఎట్లుంటుంది? ఎట్లో ఇంట్లో తలిదండ్రులు ఒప్పిచ్చికూడా పెళ్ళిచేస్కుంటారు ఎట్లాకొట్లా. కానీ వాళ్ళకు పడదుగదా! ఇంట్లో రొన్నాళ్ళకొస్తారు...నాకీ...అ...బెడ్డులేదు; ఈ చాపమీద ఎక్కడ పండుకోండేది. అంటారు, రొండుదినాలకి మల్ల విడిపోయి మల్ల పోతా ఉంటారు. అమ్మా నాన్న చెప్పిన మాటలవిని పెళ్ళిచేస్తుంటె మంచిది. అమ్మాయ్ గావాలంటే ఇంగ చూస్కొని మంచోళ్ళనే చేసోకవచ్చు నచ్చి నంకనే. అప్డు అంత బాగలేకపోతే వొదుల్‌కొంటారు. అందాని కివ్వరు. అందం ఎన్ని దినాలుంటుంది? ఓ పదేళ్ళుంటుంది.అంతేగదా. మనసు.. ఉత్తందం ఉంటే ఏంజేసేది? ఏడ్చేదా? ఇప్డు డబ్బుంటే గౌరవంగా ఉంది. అందం కంటే గూడా ఇప్డు అందం లేనోళ్ళు గూడా డబ్బుగాని ఉన్నాదంటే వాడ్ని జూసి గౌరవిస్తారు. అందంగా ఉండ్లేమెను ఎవుర్జూసి గౌరవిస్తాండారు? అప్డు అంద మొచ్చేస్తుందాటో మేటిగ్గా. డబ్బుంటే అందమొస్తుంది. ఇప్డు డబ్బుండే వాళ్ళు బాగుంటే ఆమెన్ జూసి ఏమో పెద్దవేగా చెపుకొంటార్ అదే శ్రీదేవ్ మాదిరి ఎంత సిన్మా యాక్టరై...ఇంకా బాగుండేవాళ్ళులేరు చిత్తూర్లో ఇంత పెర్స నాల్టీ? మా కాలేజ్లోనే ఉంటారు. కాని ఆమెనే ఎందుకు జూస్తార్ ఆమాదిరే. ఆమెక్ డబ్బుంది, పలుక్‌బడుంది, ప్రతిష్టుంది గాబట్టి చూస్తారు. ఇంకా బాగుండేవాళ్ళు ఉండార్గదా? అట్లగాదు అన్ని ఉండాలి. మొగోడు చేస్కుంటే గూడ పర్వాలేదు. మొగోళ్ళు గావాలంటే చేసోకవచ్చు. మొగోళ్ళకు దైర్యముంటే...యిపుడు అంత...అందంగా ఉండాల్సిందేగాని నువు కేరెక్టర్ లేకుండా వొచ్చినావంటె రెండ్రోజుల్లో మల్ల విడిపోతుండొచ్చు. ఇంట్లో చూసేగద చేస్కొంటాం అందముండేవాళ్ళుగూడ? పిల్లోల్లు చూసేది అందము. వాళ్ళొప్పుకోంటె మల్ల కేరక్టరదంతా చూసోకవొచ్చు.

స్ట్రియిక్లో నేనేం పాల్గొన్లేదు. నాక్ స్ట్రయికంటె యిష్టముండదు. కొంత మందికి బాగుంటుంది. యిద్దురు బాగుంటాము. ఫ్రెండ్షిప్ మాద్రిగా ఉంటాము కొంత మంది లెక్చెరర్ని చూస్తే పట్టదు. వాళ్ళోస్తె...క్లాస్లోకొస్తె వాళ్ళన్ తిట్టేది...విరోధులు మాద్రే ఉండారు కొంతమంది. కాపీలుకొట్నేప్రయో జనం లేదు డిగ్రీ లెవల్లో. అది టెన్తుక్లాస్ లెవల్లోనే కాపీలుకొట్టి పే సవ్వా

ల్సింది. ఇంటర్ మిడియట్ అట్ల కాదండి. యిక్కడొకొక్కొస్సేను నాలుగు పేజీ లైదు పేజీలుంటుంది. మనం ఒక్కొక్క స్సేన్ రాయాలంటే చూస్ రాయాలంటే ఎంత్సేపు...మూడుగంటలు సరిపోతుంది. ఏదన్న సొంతం ఆలోచించినా చూడకుండ రాస్తె మంచిమార్కులు బడ్తయి. చూసిరాస్తే వొక్కొక్క స్సేన్... బి.వో. ఉంది గదా...బి.వో. బేంకింగ్...ఇపుడూ...రొండున్నాయ్ గదా... బిట్టుకొట్టేదానికి లేద్దాంట్లో. బైహోర్టేం లేదు. వినాల్సిందే క్లాస్లో...అర్తం చేసోక్కవటం...

ఉపయోగపడ్తుండయ్ గదా బేంకులు చేలావర్కు. ఇంక బాగ అబివృద్ది కావాల పల్లెటూర్లోంత గూడ బేంకులు. అదే...ఇపుడు బేంకులిపుడు పెడ్తా ఉండారనొక్క. పల్లెటూర్లో దాన్కి గోడౌన్ గట్టి బెల్లం ముందిప్డు...గవోర్న మెంటుగూడ పెడ్తాఉందిగద ప్రపోజల్సు...చేస్తుంది. అక్కణ్నే గోడౌన్ గట్టి డబ్బవసరమైనప్డు బెల్లం అవతానే వొచ్చి దాంటో తోలేసి మనకు రేటుండే టప్పుడొచ్చి మనం అమ్ముకొనేట్లుగా...అప్పిస్తార్గదా. అవింకా ఇక్డ అభివృద్ధి చేస్నారంటే మండీలోల్లు దెగ్గర్కి పోవాల్సిన అవసరంలేదు, రేటు బాగా వొస్తుంది.

ఇద్దర్దీ తప్పుంది. మనమివ్వాళ మన పనికోసం మనమిచ్చేస్తాం ముందుగా ముందుగా పన్జేసుకోవొచ్చని. ఇవ్డు రొండ్రోజుల్ రావాల చిత్తూర్ కు. మేం పల్లెటూరనొక్క.నాల్రోజుల్ తిర్గాలి.నాల్రోజుల్కి అయిద్రూపాయల్. అయిదైయిదు లిరైవ్వ అయిదు. ఈ ఇరైవ్వ ఐద్రూపాయిల్ వాడికిచ్చేస్తే? ఇపుడు వొర్కెక్కువై పోయింది. వాళ్ళకు, ఇంతకు ముందు కూడా చేసినారు. వాళ్ళేం జేస్తారంటే మాకేం జేసేది...ఆ ఫేక్ట్రీ నుంచి వొచ్చేది...వాళ్ళట్లని చెప్తారు వొకళ్ళమీదొకళ్ళు. వాళ్ తగ్గిచ్చమను మేం తగ్గిస్తాము... అంటారు. వాళ్ తగ్గించమంటే మేం తగ్గిస్తామంటరు.

ప్రవేసిచ్చగూడ్దు పాలిటిక్స్లలో ఎక్కువగ్గా. అందురు పాల్గొనేదెట్లా? చదువులు పోతాయ్ గదా? అందురు రాజకీయాల్లో దిగేస్తే ఎట్లా?

# వ్యవహర్త-4

కేంద్రం : శ్రీ కాళహస్తి విద్య : లేదు

వృత్తి : వ్యవసాయం. వయస్సు:35 కులం : కమ్మనాయుడు

విషయం : స్వానుభవాలు, నమ్మకాలు మొ॥నవి.

చేనుకు ఒక యకరాకొచ్చి ఒక ఇర్వై బండి ఎర్వుదోలాల్ సార్ ·పసువు ఎర్వు.పసువు ఎర్వు దోల్నేక దాన్ని బాగా దున్నాల్ సార్. ఒక నాలుగుసాళ్ళు. దాన్ని దున్నినాక దాన్ని నాటే టప్పటికీ మనం ఇర్వై ఎనిమిది ఇర్వై ఎనిమిది గ్రోవర్ ఎయ్యాల సార్ అడగన, నారు పెరికిస్తా. దాన్ని మళ్ళీ నాటు పదహైదు రోజుల కంతా ఈరియా ఒకో మూటెయ్యాల్సొస్తాది ఎకరాకి. అదేసింతర్వాత గ్రోమోర్ గొట్టాల్ సార్ మల్లా ఒక వారాని కంతా. అదయి పోయినాక మల్లా ఒక టన్నర నెల కంతా మల్లా ఈరియా ఎయ్యాల సార్. అది ఎన్నుకు పొట్టకొచ్చేతల్కి మల్లి సల్ఫేటు ఒకోమూటెయ్యాల సార్. ఒక బస్తా. కొద్ది కాలానికి అంతా చిత్తల్ నెత్రేకప్పటికి జూన్ నెలాప్పటికి మనకు కోత కొస్తది. అది యెకరా ముప్పై మూటలు...

చేనుకు మొట్ట మొదట పసువుల యెర్వు దోలాల. పసువుల యెర్వు దోల్తానే దున్నాల. రొండు మూడు మాట్లు దున్నాల. ఆరే కొంది దున్నాల సార్ దాన్ని. బాగా తెల్ల మట్ట కొచ్చేదాకా దున్నాల. అపుడు ఊడుక పొదిన్న వేయాల, పొప్పు, పడ్చెనగ పొప్పు ఎయ్యాల. పడ్చెనగ పొప్పు పసే టప్పుడు...ఇది పాస్పేటు ఉండ్లే? ఆపాస్పేటు అడగనేసి పసి సెనిగె పొప్పు పసింతర్వాత అది ఒక్క నెల కంతా పూత కొస్తది సార్. నెలకు పూత కొచ్చి నాక కలుపు తీసేసి అపుడొక వారం దినాలు బాగ ఎండబెట్టి మల్లీ నీళ్ళె యాల్ సార్ దానికి. తేమ లేకపోతే మనం తడిపి మల్లి తొవ్వాల. తొవ్విన్ తర్వాత ఒక ఇర్వై దినాలకంత మళ్ళ ఈరియా ఎయ్యల సార్ దానికె. ఈరియా వేసిన సాట మల్లా మూడోనెలకంత మనకు పెరుక్కోవచ్చు. ఎకరాకి ఒక రొండుపుట్లు ఒత్తయి. జబ్బులంటే ఇయ్యే. పురుగు బడేది. దానికి తెల్లపురుగొస్తె గోవోరేస్తార్ సార్. ఇంకేదన్న. ఇంకోరకం పురుగైతే ఇండ్రిన్ కొడ్తార్ సా . దాన్ని ముదలే తినేస్తాది యెన్నురానీయకుండా బయటికి. ఈ మాదిరి తెల్లంగా పోతాది సార్.

ఇంటికాడ ఒక్కన్నే. ఒకతమ్ముడుంటే సేద్దెం జేస్తా...ఒక ఇర్వైగొర్రె జీవాలుండయిసార్. గొర్లు. దాంతో మల్లొక నాల్గుపసువులుండయ్. ఎనుములు.

పాలు తీసుకొనేటియి. ఇంటికాడ పిల్లకాయ జెల్లకాయలు. మా తమ్ముని కి ఇద్దరు కొమార్లు సార్. మా యక్క ఒకామె ఉండాది. ఇంటికాడ్నే...పొరుగూర్లో ఇంకో కాయన ఉండాడు.

ఈనింతర్వాత చెనిగిపెండి తవుడెయ్యాలసార్ దానికి. ఏత్తే మన పూటకి రొండు లీటర్లు పాలిస్తాదిసార్. దానికి పచ్చిపెసర తీస్కొచ్చి పెట్టాల. మద్దెన మద్దెన బాగా కడగాల. సాయంత్రం అయిదు నాలుగ్గంటలకల్లా మల్ల పాలు తీసుకోవాల. ఆ...రొండుపూట్లా. పద్దున, సాయంత్రం. రొంద్రూపాయలు. డైలీ ఒస్తడు. పదహైదు రోజుల కొకసారి డబ్బిస్తారు. కేంద్ర(లో) రోజుకి మూడులీటర్లు. ఆర్రూపాయలొత్తై దానికి మూడ్రూపాయల్ మేపు బెడ్తుంటిమి, ఒక సేద్దెగాడ్ని బెట్టుకోవాలంటే వాడికి ఆరొందల్ జీతం సార్ మూడుపూట్లు అన్నంయేసి. సేద్దెగాడికి. వాడ్కి బట్టలియ్యాల, మూడు పూట్ల అన్నం బెట్టాల. వాడ్కి మంచిచెడ్డజూసి ఆరొందల్ రూపాయలియ్యాల సార్. సంవచ్చరం ఆరొందల రూపాయలియ్యాల. వోడికి వొల్లు బావుండలేక వచ్చిందీ, నీబోటి...తోలకరావాల డాక్టర్ కాడికి. వాడికి ఇరవయ్యో, ముప్పయ్యో ఎత్తకరావాల, తోడకరావాల, ఇంజెసననీ, మాత్రనీ...మా ఇంట్లో మా యక్క వొకామె ఉండాదిసార్. మా బామర్ది వొకాయన ఉండాడు. మా తమ్ముడు, మా తమ్ముని బార్య, పిల్లలు ఉండారు సార్. ఒక సేద్దెగాడు ఉండాడు. పెళ్ళయిపోయింది. ఇద్దరు పిల్లలు సార్. పెద్దామె పెనిమిటి నాగుబాము కర్సి చచ్చిపోయినాడు. వొద్దేపాలంకి అవతల...మన సత్తెవేడు రూట్లో.

వాళ్ళు ఆరుమందొస్తున్నారు ఆ దోవన నెత్తిన బెట్టుకొని బరువు. ఆయారుమందొస్తుంటే ఈ నడిమిద్దె తొలిగిపోయే సమయంలో ఈ మాదిరి గెనెం ఉంది సార్ అడ్డము. ఆ గెనెం కింద కాలుబెట్టి వీళ్ళు వొకడు...తేలేక పోయినాడు దాంట్లో మూట. కానీ మనం ఇంటికాడనుంచి తొందర్గ వచ్చి అందుకొందాంగదాని వచ్చేలోపల ఆడ నాగుబాము ముట్టింది సార్. నాగుబాము బొటనేలకాడ ముట్టేకాడికి ఆడ మనుసుల్ని కావలాపెట్టేసి ఆడువస్తుండుడు. నలుగురు ఎత్తుకుని వచ్చినారు ఇంటికై. మరి...ఇక...పాము గరిసిందని జెప్పకుండా ఈయనకు తేలుకుట్టిందని చెప్పినారు. తేలు కుట్టిందని చెప్పేకాడికే...ఈ పొద్దు సాయంత్రం కరిసింది...ఒక్కదినం ఉంటుంది సార్ పైనము. ఆ కలుగుల్లో పామెక్కడా అవపళ్ళే. మీ బోటి పెద్దోళ్ళు అది మిత్తవ అన్నార్ సార్. బిడ్డబుట్టిన మూడో నెలకే చచ్చిపోయినాడు. మేమే దోలకొచ్చి ఈడ ఎస్సెల్సి వరకు చదివిచ్చినా. ఇప్పుడు పెళ్ళిప్రయత్నం చేస్తున్నం అబ్బాయికి.

మా తమ్ముడు ఎగసాయం పని. నీబోటోళ్ళు వస్తే మీతోగూడాపోయేది, ఆడ యెడ్లకు బట్టిచ్చేది. పిలకాయలపని, పిల్లల్ జూసేది. లేద్సర్. ఒకడు మా బామ్మర్ధి ఒకాయన ఎస్సెల్సి వరకు సదివి నిలిపేసినాడుసార్. ఇప్పుడు

మేమిద్దరమే ఎగసాయం పనిబోతన్నం. నేనే కొద్దిగా యేపారం చేస్తన్న సార్. పాలేపారం జేస్తా. ఈ వొడ్లేపారం జేస్తా...వొడ్లు దీస్కొచ్చేది నీబోటోడి కేసేది నాలుగు దినాలకి వారం దినాలకి డబ్బు దీసకపోయేది. వడ్లా! తిత్తవనే టియి తొంబై రూపాలుండయ్‌సార్. అయ్యార్ టొంటి అనేది న్నూర్రూపా లుండయ్‌సార్. ఇక వారసమ్మాత నేవి తొంబై యిదు రూపాయుండయ్ సార్. ఈడ మన బజార్లోనే బాడిగుంటది సార్. ఎద్దైన మూటకు ఒకరూపాయ్, ఒక టిన్నర రూపాయ్, మన చెక్ పోస్టోళ్ళకు అద్ద రూపాయ్ మళ్ళా ఎట్టా యనకి ఒక ఇరవై పై సలియ్యాల ఒక మూటకు, ఇట్ జూస్కొంటే న్నూర్రూ పాయిల్ బడ్తుంది సార్,

మా బోటికాడ ఏ వుండయ్ సార్. మా ఏవుండవ్‌సార్ విసయాల్. జీవాల్ తోలుకపోయేది బయటికి. ఏదో సాయంత్రతం వొచ్చేది. అన్నం తినేది, బొంచేసొచ్చి పడుండేది. నాకొక్కద్దిగ వొల్లు బాలేదు సార్. కడుపులో నెప్పి. అదే రొండు మూడు సవచ్చరాల. కడుపులో మన అన్నం తింటే జీర్నానికి వొచ్చేదిల్లే. మన పేవుమాదిరి ఉబ్బుతా ఉండింది. నెల్లూరుకొచ్చి రొండుమాట్లు ఫోటా తీసుకొన్నాసార్. మాత్ర యిచ్చినారు సార్. పేగులో పుండై ఉండాది. అది ఒక అయిదునెలు తిన్నాసార్. సుమారుగా ఉండింది. మల్ల రమ్మన్నడ్ సార్ ఆయన. పోయిన. మల్లా కాలుముడి పరిచ్చ చేసినాడుసార్, మన వొంటేలు. సరి ఇంకేంజబ్బులేదు. నువ్వు ఏదైనా ఆహారం ఏదైనా మాంస పదార్థం తింటా ఉండాల. అని చెప్పినాడు సర్ ఆయన. టయానికి అన్నం లేక ఎక్కువ కారం తినగూడదండి. అన్నం తిన్న తర్వాత. ఇప్పుడు తగ్గిపోయింది. ఇప్పుడేం తినేదిల్లే.

కడుపులో నెప్పికోసమేసార్. అట్టగాద్‌సార్. ఇపుడూ. మనం ఒక స్త్రీని జేస్కొంటాం సార్ పెళ్ళి. ఉన్నట్టుండి టక్కున చచ్చిపోతవ్. ఆయ మ్మాయి పరిస్తితి ఏంగా వాలె? అదిగాద్‌సర్. మా బామర్ది ఒకాయన పెళ్ళి కెది కొచ్చుండినాడు. ఇంగ అతనికి జేయాలసార్ పెళ్ళి. మా తమ్ముడికి ఎటనో ఇద్దరు మొగపిలకాయిలు పుటినార్ సార్. వాళ్ళిద్దర్ని సాకేస్తే సాల్దా?

సెనిగేసినాము. ఈ సెనిగేసిం తర్వాత ఏందంటే చెట్టేమో. ఏరుకొట్టే సింతర్వాత దాని సెట్టుకు...ఆ ఏరుకు ఎప్పుడు పురుగు ముట్టిందో రొండు గాయలు, ఒక్కాయ, మూడుగాయలు. అది ఎకరా వచ్చేదా...నాల్గుమూటలు, అయిదు మూటలు కాడికి అయింది. రొండొందలు రూపాయిల్ సార్ బస్తా. ఇంగ దాన్నేం జేస్తం?

దెయ్యాలుండయ్, బూతాలుండయ్, పిసేచులుండయ్ మొత్తం ఉండయ్ సార్. ఉండాది సార్. ఉండాడుసార్. జెడలమునేస్వెరుడని ఒక డుండారుసార్. బాగా జడలుంటే నీబోటోడివైతే బయపడిపోతవ్. దాంటో రాచ్చస గండాన పుట్టి నోడికైతే దానికేం అవపడదుసార్. వోడికేం అవపడదు తరాత. సెనిక్కి నీల్లు ఏస్తన్నం మడిక్కే. మడికె నీల్లుయేస్తుంటే సలికాసుకో

వాలనేసి. చలిగా ఉంది సార్ చలికి నీరు గట్టాలని. ఆ...అంత దూరాన వస్త న్నది సార్ మన కొరివిగట్టు మాదిరి ఎలిగిచ్చుకొని బాగా మన కరెంటు ఎట్ట పొడచకొస్తదో ఆ మాదిరి వొస్తాది సర్ ఇదేమో ఏదో వొస్తన్న నిప్పేత్తుకొని ముంటెత్తుకొని కొద్దిగ దెగ్గిరిగ పోయిన సార్. చూసేశలికి ఈ మాదిరి జెడల మునెస్వరుడుసార్ జడల మునేస్వరుడుసార్ ఆడ గమ్మున కూకొన్నసార్ గెనెమ మీదన కూకొన్నాక అపట నేరుగ వొలిక లేకపోతాడు సార్ వొలికెలోకి పోయినాక అంతట్లో ఆడ ఆగిపోతాడుసార్. మల్ల అవపడదు. మల్ల తర్వాత మల్లా రొండోరేత్రి అవపడతాది. నాగ్యాదు. ఎవొరికంటే వాల్లకె.

యాతం గీతం ఏం లేదు. చెరువు నీళ్ళే. మన పల్లె చెరువునీళ్ళే తూము బారతాది. ఇంకా రొన్నెల్లు బారతాది ఒర్సం వస్తె. మన కాళస్తి నిల్లు రావా ల్సిందే తొట్ట-బీడు చెరువు నీళ్ళు, సల్లాగొడవ చెరువు నీళ్లు ఆ మన కాళస్తి నీళ్ళు సార్. వచ్చేదానికి కపిళ్ళలేవు. మిసన్లు లేవు ఏవి లేవుసార్ బావులు గూడలేవు. చెరువునీళ్ళే మాకు రొండుసార్లు పండతాదిసార్. బాగపండతాది. ఏదో ఒకటుంటది మింపచెట్లని, మంకాయని, చిక్కుడ చెట్లని ఉంటయి.

బయముండదుసార్. రాట్చస గండాన పుట్టినోడికి అవుసార్ రాట్చస గండాన పుట్టినోల్లకి అవపడదుసార్ దేవగనం, రాట్చస గనం...రాట్చసగండాన పుట్టినోళ్ళు దేవగణం పుట్టకుండోళ్ళు పోతే మల్లా కొద్ది దినాలకి సచ్చిపోతాడు. సూచి సచ్చిపోతాడు జరిగింది. మా ఊల్లోనే వొకతన్సార్ జడలమునేస్వరుడు మాదిరి వొస్తన్నడంట చూసేసినాడు. సూసే గనక అతని పొదరు బుట్టిందిసార్ ఆడనె వొల్లో వొల్లు దడబుట్టింది వొల్లు దడబుడ్తానే ఇంటికొచ్చినాడు. ఇంటి కొచ్చి ఈ మాదిగా సూసినాను పలాని దెయ్యాన్ని ఈ మాదిరిగ అయిపోయిం దనే తలికే సరే ఇండీసననీ, మాత్తర్లని తీసి యిచ్చినారు. దానికేం సుమారు గాలే. ఈ బుడబుక్కలొస్తారు జూసేవ్ వాల్ దెగ్గర తాయత్తులేసినారు. తాయత్తే సిన కొద్దికాలానికే సచ్చిపోయినాడుసార్ ఆ బయంసేతనే. కొర్విగట్టు దెయ్యాలంటే అయి మామూలు దెయ్యాలుంటయ్సార్. అదిగాదుసార్ మేం సాయంత్రం అస్తమానొత్తె ఆరుగంటల అయిదు గంటలకి మడికెలె మీదకెల్తుం టిమిసార్ పండగెళ్ళినప్పుడు సాయంత్రము. తొమ్మిది, పన్నెండు గంటల కొస్తుసార్ రేత్రి ఈ సందున అవపడ్తుంది సార్ కుక్కలని నక్కలని కుక్కల్తో మన నక్కల్తోపాటు, మనిసితోపాటు ఈ మాదిగ అవపడ్తుంటది సార్. కొర్విగట్టు దెయ్యాలంటే జడలమునేస్వరుడంటే అదే ఎల్తూ ఎల్తురుగ అవ పడ్తూ ఉంటా ఉంటది. మనం ఇప్పుడూ...మనం ముందు పోతంటాము. మనిషిమాదిరి రాయేసినాడంటే నాలగైదు దినాలకి సచ్చిపోతాడు సార్ ఆ మనిషి. ఆ దెయ్యమే రాయేస్తాది సార్. నల్లకుక్కమాదిరిగ అవపడ్తది సార్. జరిగింది సార్. మా వూల్లోనే. మొన్న వొకాయన సచ్చిపోయినాడు సార్ ఈ మాదిరిగ...పాయిఖాన్లోకిపోయి పొద్దు చేనా రేత్రిపోయినాక వస్త

న్నడు సార్. వస్తా ఉంటె దెయ్యం అపుడు రాయేసిందంట సార్. రాయే సుంటే ఏనుపేటని బర్గొడ్డని పాలిత్తది బర్రె అదని అదిలిచ్చేకాడికి. ఆడే అపపల్లేదు సార్ ఆయనకి. అవపడకపోయేతలికి అట్టరావటం పడగబెట్టి పడు కొన్నాడు. చనిపోయినాడు.

ఏం సార్? రెండువేల అయిదొందల రూపాయల్ బెట్టి ఎద్దల కొన్నాను. దానికి నీరు కారుతున్నది. ఇటాంటి మారాజు వచ్చి కాలుబట్టు కొంటే దానికి ఏదైనా జూస్తారూ. పేదోళ్ళుమూ అయగారికాడి కొచ్చినాము.

జెతర్లో బ్రమ్మాండంగా జరుప్తార్ సార్, ఇంటికి రెండు పొటేళ్ళు ఏత్తారు సార్. మన పోలేరమ్మ నిలబెడ్తారు. ఆమెకి ఆహారాలని, పూలని, కరెంటని కోసి ఈ మాదిరి జేస్తార్సార్. ఒక నాలుగు తప్పెట్లు తెస్తార్సార్. ఒక రెండు మంగల మేళాలు సన్నాయిలు ఇయన్ని తెస్తార్సార్. ఇంటికి రెండేసి పొటేళ్ళేస్తారు సార్. ఏదైనా వొచ్చిన జెనానికి, చుట్టాలకిలచ్చేనంగ జరుప్తా అమ్మోర్ని మర్నాడు రెండోరేయి ఒంపిచేత్తార్సార్ బల్దిర్గి. ఊరంత బల్దిర్గేది. ఆడ బద్దెపిల్ల, దాన్ని మనిసి ఎట్టోడే గొంతుకొరికేసేది. పంటితోటే కతక్కున కొరికేసినాడంటే చచ్చిపోతాది. అపుడు ఆ పేగలు తీసుకొనేదీ, ఆ ఎట్టోడే జెంజెమేసుకొనేది, పేగులు, జెంజెమేసుకొనే టప్పుడు వాడికి ఊపిరి తాపిరి ఏముండద్ సార్. ఆ నోటికి ఈ నేలికుండ్లే? ఈ నెలికతీస్కొని ఈ నోటికి కరిపిచ్చుకొనేది, మేకపిల్ల నేలికే. అటు ఊరు మొత్తం తిరుక్కొని వొచ్చేది. వూరుచుట్టూ తిరుక్కొని వచ్చే అక్కడ బండే సేసేది. తర్వాత ఒక నాల్గు బిందెల నీళ్ళు పైన పోత్తే వాళ్ళకి కొత్తగుడ్డో కటియ్యాల సార్. బ్రమ్మాండంగ జరుప్తార్. జేతర బాగ జరుప్తార్.

పొటేళ్ళ నరకటము. బ్రేంది తాగటమూ సారాయిల్ దాగటమూ మేము నాలుగేసి వొందలు, అయిదేసి వొందల బెట్టి ఒక్కోదాన్ని కొంటాం సార్. అందను నరకాల. నరక్కుండుండర్ సార్. కోడ్నైనా కోస్తారు. ఆ పొటేలే ఎక్కువ సార్. రెండొందల నుంచి సెక్తి కొంది కొంటారు. ఇంక జాతర ఇంకో నాల్నెల్లుండంగా సార్ అప్పుడు కొంటార్ సార్ రెండొందలిచ్చే అది బాగా పెద్దదయ్యి, దానికి మేపు. ఆహారం బాగా బెట్టి వొచ్చేకాడికి బాగా వోహ రెండు మనుగుల కూర అవుతాది సార్. ఆది అప్పుడు దర ఏస్కొంటే అయిదొందలు, నాలుగొందలు. ఇప్పు మూడేళ్ళు జేసి నాకూ సార్. ఈసారికూడా జేస్తాం. సేత్తే పయిర్లు బాగా పండతాయని చెప్తార్సార్. ఆ పండ్తాది. నీ బోటి పెద్దోళ్ళు సెప్తార్సార్.

ఎవ్వర్రాలేసార్. మేమో వొత్తాం సార్. పైరుపెరొక్కొని ఒచ్చే దనూ, ఈ డొచ్చి ఆఫీసో జూపిత్తే ఇక్క జెప్తారు.

రెండువేల అయిదొందల్ సార్. అంతా ఆరునెల్లు అయింది సార్. కన్ను నీరు కార్తంది. లేద్సార్. కొన్నప్పుడే నీరు కార్తుంది సార్. మన్నం.

ఆడ ఎగసాయం ఏని సేయలేసార్. ఒకనాడు ఈడకొచ్చేతలికి ఒహ మన అయ్‌గార్ లేకుసార్. ఆయన ఆల్ చెం అయ్యేతలికి ఆయన కాంపోండర్ ఉంటే ఒకడు మందు పోసినాడు సార్ కట్టో. నాయనా నాలో జులు వర్సగా రావాలనే ఆ మొందేసినా. ఆ మెందేసింతరాత కన్ను వాసింది సార్ దానికే. కన్ను వాసేకాడికే సిబోటి పెద్దోళ్ళు ఏవుంటే రేయ్ మన పెదడాట్టర్ దెగ్గర పొయ్యి అయగారికి చూపెంచినావంటే దాని అప్రేసన్ జేసేడుదైనా జెప్తారన్నార్ సార్.

దెయ్యాలు బట్టుకోంటే మెత్తంగుంటయ్. చిక్‌తాయ్ మనికే? మెత్తంగుంటయ్. లేద్ సార్ మెతంగుంటయ్. మెత్తంగుంటయ్ సార్. తోళ్ తోళ్‌గా మనగుడ్డె మాదిరిగా ఉంటయ్ ఆ మాదిరి సెరీగం మొత్తం ఎమికలుండవు ఏముండవు. అప్పుడే జెడల మునీస్వెరున్ని పట్టకొన్నె సార్. ఏవన్లా. రాళ్ళేయనా ఊద్రాదు చేతికి మనచేతికి ఏం ఊద్రాదు. బలేదెబ్బ కొట్టాది సార్. చెంపకజెట్టే చెంపపైన కొడ్తాది, నడిం పైన కొడ్తాద్, యేడేనా సార్ కొట్టింది సార్. మంచి దెబ్బగూడా కొట్టింది సార్ ఒక సారే. నాలుగునెల్లు పైకి లేవ్‌లే సార్ నేనుగూడా బాగాలేకుండా పోయున్న. మా వూళ్ళో పసులుక బాలేకుండా వచ్చింది సార్. సాళెయ వాలెంనుంచి సీనయ ఉండడు. అతన్ని తోలకొచ్చి వూళ్లో పసులకి మంత్రిచ్చి ఈబూది బండరీ కట్టినార్ సార్, కడ్తుంటే ఆడ నేనున్ను ఇంకో అబ్బాయి ఇద్దరంగల్సి సాయంత్రం స్తానం జేసేది, దొడ్డి, దొడ్డికాడ కరుపురం యెలిగించేది. వస్తున్నేం సార్. సాయింత్రం ఈమాదిరి జేస్తుంటే లాస్టు ఆ రోజ్‌సార్ వారం రోజులు పెట్‌నాడు ఆయన. ఆ పొద్దు లాస్టయితే మొత్తం దిరుక్కొన్నం సార్. ఉత్తరంగ బోయ్యా కరుపురం యెలిగించేలోపల నేనే పైకెల్తున్నాన్‌సార్. న్నాకే తెలవకుండొల్లు ఆడ బ్రమ్మాండంగ గాలి ఉండాదంట. అవట్ట ఆ మడిసేంజేసే నాతోగూడా వచ్చిన మడిసి కిందకి లాగేసినాడుసార్. కిందకి లాగేసిన పాటా ఒకాయనకి దేవుడొచ్చే నువుజేసింది తప్పుపనీ, నీకు మునీస్వెరుఙున్నాడు గావట్టి నువ్వాపనికి రాకూడదూ. ఆయనగాని లేపోతే నువు సచ్చిపోతావు అన్నార్‌సార్. అది మొదల్కొని ఈ వూళ్ళో ఈమాదిరిగ ఉంటున్నా సార్.

ఆ...మాకుండాది సార్. మనేస్వెరుడికి నల్లమేకల ఒక జోడు బెడ్తాం సార్. అది మన మొక్కుబడేబగవంతుడి మొక్కుబడి పిలకాయల యెంటికలు తీయించేటప్పుడు మొక్కుబడి.

మన కోతి కొతెట్ట పరుగెత్తదాది సార్? యెముకలంటే కోతికింద అరికాళ్ళు మెత్తంగుంటయ్‌సార్. ఆ మాదిరిగ ఉంటుంది. ఉండవుసార్ యెనికిలేంఉండవు సార్. యెనికలంటే ఏదో సన్నెనిక అట్టాటుంటయ్‌సార్. పట్టుకుంటే మనకు తెలవద్‌సార్.

# 9

# మాండలిక పద (బంధ) కోశం

| | |
|---|---|
| అగ్గి | నిప్పు, మంట |
| అడమానం | తాకట్టు, తనఖా |
| అంకణం | స్థల కొలమానం (ఆరు అడుగులు పొడవు + ఆరు అడుగులు వెడల్పు) |
| -అంత | -అల్ల<br>ఉదా. రేపటికంత (C)<br>రేపటికల్లా (MST) |
| అనపకాయ | చిక్కుడు |
| అప్పకొమార్డు | అక్కకొడుకు |
| అప్పచెల్లెండ్లు | అక్కా చెల్లెండ్లు |
| అప్పా | నాన్నగారు, అయ్యా! |
| అమ్మోరు | మశూచి, అమ్మవారు, స్త్రీదేవత |
| అయ్యవారు | ఉపాధ్యాయుడు, పురోహితుడు |
| అవపడు | కనపడు |
| ఆకు | పొలం బలం కోసం వాడబడే ఆకు ఎరువు |
| ఆడ | అక్కడ |
| ఆడబిడ్డలు | కూతురు, ఆడపిల్లలు |
| ఆడామె | ఆడమనిషి, స్త్రీ |
| ఆదరవు | వసతి |
| ఆది | మొదలు |
| ఆమె | ఆమె, ఆవిడ (చిన్న పిల్లలను కూడా ఇలాపిలవటం విశేషం) |
| -ఆల | -పూట, |

---

C = చిత్తూరు   MST = ఆధునిక ప్రామాణిక భాష

| | |
|---|---|
| | ఉదా. పొద్దుటాల(C) పొద్దునపూట (MST). |
| ఆ లెక్కన | ఆ రకంగ, in that account |
| ఇంగ | ఇక, ఇంక |
| ఇన్నూ్నగు | రెండు వందలు |
| ఇరు- | రెండు ఉదా. ఇరు పార్టీలు (C) |
| ఈడ | ఇక్కడ |
| ఈను | ప్రసవించు (జంతు సంబంధి) |
| ఈ మద్దెకాలం | ఈ రోజుల్లో |
| ఈమె | ఈమె, ఈవిడ |
| ఉలవలు | ఒక ధాన్య విశేషం |
| ఎగరగొొట్టు, ఎగరేసు | ఎగగొట్టు ఉదా. బాకీ ఎగరగొట్టు (C) |
| ఎట్టాయన | కరణం, మునసుబు దెగ్గర వెట్టి పనిచేసే వ్యక్తి |
| ఎత్తుకోను | తీసుకోను ఉదా. జండాఎత్తుకోని (C) జెండాతీసుకుని (MST) |
| ఎనికలు/ఎముకలు | ఎముకలు |
| ఎనుములు | బర్రెలు/గేదెలు |
| ఎన్ను | వరి పంట పండేటప్పటి స్థాయి. (తెల్లగా ఉంటుంది) |
| ఎలిదుక్కి | మొదటి దుక్కి |
| ఏమార్చు | మోసంచేయు |
| ఒకటిన్నర నెల | నెలా పదిహేను రోజులు |
| ఒలికె | శ్మశానం |
| ఒలి | కట్నం |
| కచ్చె | కసి, కోపం |
| కట్టుకోను | పెళ్ళి చేసుకోను |
| కట్టెకాయ | చింతకాయ |
| కట్లెపుల్ల | కట్టెపేడు/కట్టెపుల్ల |
| కడగా | విడిగా, వేరుగా |
| కంటెకురుపు | కంటి కురుపు |
| కపిల | యాతం |
| కయ్య | భూమి, వరిపొలం |

| | |
|---|---|
| కలుగులు | సందులు, బొరియలు |
| కల్లు | సారా |
| కసువు | మేత, గడ్డి |
| కాగడాలు | ఒక రకం పువ్వు |
| -కాడ | దెగ్గర |
| -కాడికి | కంటే/కన్నా |
| కాడిమాను | కాడి |
| కాంచు | కాచు, వేడిచేయు |
| కాలు | పావు, 1/4 భాగం |
| కాలుముడి | మూత్రము |
| కావిలి | కాపల |
| కిసి | సమానవాయిదా, instalment |
| కుటుంబరం/కుటుంబం | కుటుంబం |
| కుంట | భూమి కొలత (15 కుంటలు = 1 ఎకరం) |
| కులకట్టడి | కుల సంప్రదాయం |
| కూకోను | కూర్చొను |
| కూలి మడకలు | కూలికి వచ్చే నాగళ్ళు/అరకలు |
| కొట్లాట | దెబ్బలాట, తగాదా |
| -కొంది/-కోలది | -కొద్ది<br>ఉదా. చెప్పేకొంది/కొలది(C)<br>చెప్పేకొలది (MST) |
| కొన | చివర, అంచు |
| కొయ్య | చెక్క |
| కొరివిగట్టు దెయ్యాలు | కొరివిదెయ్యాలు |
| కొలుచు | ప్రార్థించు, సేవచేయు |
| కొళాయి | (నీటి) పంపు |
| ఖాయిలాపడు | జబ్బుపడు, జ్వరపడు |
| గమ్మున | ఊరకే, ఏమీ మాట్లాడకుండా<br>ఏమీ చేయకుండా |
| గలాటా | గోల, గొడవ |
| గలీజు | అసహ్యకరమైన |
| గుళికలు | మాత్రలు |
| గెనెం | పొలం సరిహద్దు, గట్టు |
| గేలిచేయు | ఎగతాళిచేయు |
| చవటబూములు | చవుడు భూములు |

| | |
|---|---|
| చిత్తర్ నెల | చైత్రమాసం |
| చిన్నగుత్తికాయలు | వేరుశనగకాయలు |
| చెనిగె | వేరుశెనగ |
| చేనా | చాలా |
| చేముండమ్మ గుడి | చాముండేశ్వరి ఆలయం |
| జగడం | తగాదా |
| జమాను | నౌకరు |
| జల్లు | తాలు<br>పొలంలో ధాన్యం తూర్పార<br>చేసే సమయంలో వచ్చే<br>పొట్టు/నూక |
| జవకునేలలు | చవటిభూమి |
| జాస్తి | ఎక్కువ |
| జిల్లలు | ధాన్యం దంచే వస్తువు |
| జీర్ణం | ఆహారం జీర్ణమగుట, అరగటం |
| జీవాలు | పశువులు, మేకలు, గొర్లు<br>తదితరాలు |
| టెంకాయ | కొబ్బరికాయ |
| టెంకాయల పండగ | గ్రామదేవతల పండగ(జాతర) |
| డీలాపడు | నీరసపడు |
| తక్కాలి కాయలు | టొమాటోలు |
| తక్కాలి లోన్స్ | రుణ విశేషం |
| తగరారు | తగాదా. |
| తగులుకొను | వేధించు |
| తట్టలు | బొచ్చెలు |
| –తడవ | –సారి<br>ఉదా. ప్రతితడవ (C)<br>ప్రతిసారి (MST) |
| తని | వేరే, ప్రత్యేకమైన<br>ఉదా. తనీ పార్టీ (C) |
| తప్పెట్లు | దండోరా |
| తలారి పని | గ్రామాధికారుల ఆదేశాల<br>మేరకు పన్నులుపసూలుచేసే పని |
| తాయిదు | తాయిత్తు |

| | |
|---|---|
| తిరుక్కొను | ఎదురుతిరుగు, తిరగబడు, ఊర్కె పచార్లుచేయు... |
| తూము | నీరు పారుదల అయ్యేందుకు ఉపయోగించే రంధ్రం. |
| -తూరి | -సారి.<br>ఉదా. ఈతూరి (C)<br>ఈసారి (MST) |
| తెలవదు | తెలియదు |
| తెలుంగు/తెలుగు | తెలుగుభాష |
| తేరు | రథం |
| తై | నెలపేరు |
| తొలీగ | మొట్టమొదట |
| తొలీత | మొదటి, మొదటికాన్పు |
| తోలకరావాల | తీసుకరావాలి |
| తోసేయు (కేసు) | (కోర్టులో కేసు) కొట్టివేయు |
| దండిగ | బాగా, చాలా, సమృద్ధిగా, చాలినంతగా |
| -దా | -ఏ<br>ఉదా. వాడు దా (C)<br>వాడే (MST) |
| దినం | రోజు<br>ఉదా. ఈదినం వచ్చినాడు(C)<br>ఈరోజు వచ్చాడు (MST) |
| దుడ్డు | డబ్బు |
| దెబ్బలాడు | కొట్లాడు |
| దేవళం | దేవాలయం, గుడి |
| నమ్మిక | నమ్మకం |
| -నాక/-నంక | తర్వాత |

| | |
|---|---|
| | ఉదా. వచ్చినంక/నాక (C) |
| | వచ్చినతర్వాత (MST) |
| నాటుమందు | గ్రామాల్లో వివరం తెలిసీ తెలియకుండా ఉపయోగించే మందు |
| నిండా | పూర్తి, చాలా |
| | ఉదా. నిండా మోసం (C) |
| | చాలా మోసం (MST) |
| నిలుచు | ఆగు, నిలుచు |
| | ఉదా. పెళ్ళినిలిచిపోయింది (C) |
| | పెళ్ళి ఆగిపోయింది (MST) |
| నూకలు | బియ్యం నూకలు |
| నూరు | వంద, నూరు |
| నెత్తి | తల |
| నేరుగా | బారుగా, సరాసరిగా |
| | డైరెక్ట్‌గా |
| నేల | పొలం, భూమి |
| పడగబెట్టు | మంచంపట్టు (రోగంతో) |
| పట్టదు | సరిపడదు |
| | ఉదా. అతనంటే పట్టదు (C) |
| | అతనంటే పడదు (MST) |
| పట్టుకోను | మినహాయించు, పట్టుకోను |
| | ఉదా. డబ్బుపట్టుకొన్నేడు (C) |
| | డబ్బు మినహాయించుకొన్నాడు (MST) |
| పదరు | దడ, వణుకు |
| పదహైదు | పదిహేను |

| | |
|---|---|
| పల్లె | గ్రామం, పల్లెటూరు |
| పసికర్లు | జాండిస్ రోగం (కళ్ళు,వొళ్ళు పచ్చబడే వ్యాధి) |
| -పాటకి | -సరికి |
| పిలకాయలు | చిన్నపిల్లలు, కుమారులు, కుర్రవాళ్ళు |
| పిలగాడు/పిల్లోడు | చిన్నపిల్లవాడు, అబ్బాయి |
| పుట్టి | పదకొండుబస్తాల ధాన్యం |
| పెట్టసద్ద | సజ్జపంట (స్త్రీజాతి) |
| పెద్దరెడ్డి/రెడ్డి | మునసుబు (గ్రామాధికారి) |
| పెద్దాయన | ఇంటి యజమాని, భర్త |
| పెనిమిటి | భర్త |
| పెనుం | పెనం |
| పెరుకు | పీకు |
| పైరు | పంట, పైరు |
| పైసాలు | నయాపైసలు |
| పొద్దు | రోజు, పూట<br>ఉదా. ఈపొద్దువచ్చినాడు(C)<br>ఈ రోజు వచ్చాడు (MST) |
| పొద్దుగుయ్యాలకే | పొద్దుగూకేటప్పటికి |
| పొన్ని | మసూరి రకంబియ్యం |
| పోడ్సినాడు/పోయినాడు | వెళ్ళాడు/పోయాడు. |
| పోతు సద్ద | సజ్జ పంట (పురుషజాతి) |
| బద్దె పిల్ల | మేక పిల్ల |
| -బంటి | -బట్టి<br>ఉదా. దాన్ని బంటి (C)<br>దాన్ని బట్టి (MST) |
| బలి తిరుగు | జాతర సమయంలో బలి ఇవ్వడానికి ఊరుచుట్టూ తిరగడం. |

| | |
|---|---|
| బాకు | కత్తి |
| బాసికాలు | పెళ్ళిలో వధూ వరులు కట్టుకొనే భాషికాలు |
| బాపనోల్లు | బ్రాహ్మణులు |
| బిచ్చమెత్తు | అడుక్కొను |
| బిడ్డ | ఆడపిల్ల కూతురు |
| బీడీ కాయలు | బీడీలు |
| బుడ్డి | దీపం (కిరోసిన్) బల్బు |
| బురద కయ్య | మాగాణి |
| బేస్త వారం | గురువారం |
| బొట్టు | తాళి బొట్టు |
| బోదె | ఇంటి కప్పుకు ఉపయోగించేవి. |
| భేది | విరోచనం |
| మట్లు | బావి తవ్వకం కొలమానం (1 మట్టు = 6 అడుగులు) |
| మడకలు | అరకలు/నాగళ్ళు |
| మడి | వరిపొలం |
| మణియగారు | గ్రామాధికారి, మునసబు |
| మదింపు | విలువ |
| మద్దెల | వాయిద్యవిశేషం, మద్దెల, డోలు |
| మందులు | ఎరువులు, మందులు |
| మన్ను/మట్టి | మట్టి |
| మబ్బు | చీకటి, మేఘము<br>ఉదా. అది మబ్బు రాత్రి (C)<br>అది చీకటి రాత్రి (MST) |
| మరల | మళ్ళీ |
| మస్తర్ | హాజరు |
| మస్తుగ | పూర్తిగ, నిండుగ, చాలినంతగ |

| | |
|---|---|
| -మాదిరి | -లాగా,-వలె,-మాదిరి |
| | ఉదా. ఇల్లుమాదిరి ఉంది (C) |
| | ఇల్లులాగా ఉంది (MST) |
| మాన్లు | చెట్లు |
| -మార్లు | -సార్లు |
| మిత్తవ | మృత్యువు |
| ముకాల్కల్- | ముప్పావుభాగం |
| ముట్టు | తాకు, కరుచు |
| | ఉదా, పాము ముట్టింది (C) |
| | పాము కరిచింది (MST) |
| ముందుకాలం | పూర్వకాలం |
| మునుపు | ముందు |
| మున్నూరు | మూడువందలు |
| మూట | బస్తా |
| మూడుపదులు | ముప్పై |
| మేపు | మేత |
| మేలు | మంచిది |
| | ఉదా. వాడువచ్చేదేమేలు (C) |
| | వాడురావడమేమంచిది(MST) |
| మోడంబెట్టు | ముసురుపట్టు (తుఫాను) |
| రంపులు | పేచీలు, గొడవలు, తగాదాలు మొ॥నవి. |
| రాగులు | ఒక ధాన్యవిశేషం |
| రేయి/రాత్రి | రాత్రి |
| లగ్గం | పెళ్ళి లగ్నం |
| లెక్క | పద్దు |
| లెయ్ | లే |
| లే | లేదు |
| వంక | వాగు |

| | |
|---|---|
| వరంబుడి | ఆదాయం |
| వరుమానం | జీతం |
| వంస్తైవళి | వంశవృక్షం |
| వాగు | నది |
| వాద్దెయార్ | ఉపాధ్యాయుడు, పెద్దమనిషి |
| వాయించు | తిట్టు, చివాట్లుపెట్టు |
| విబూతిపట్టాలు | విభూతి రేఖలు |
| -వేళ | సమయం<br>ఉదా. ఈ వేళకు అయింది (C)<br>ఈ సమయానికి/ఇప్పటికి<br>అయింది (MST) |
| వైజ్జుడు | డాక్టరు |
| సత్తువ | బలం, శక్తి, ఎరువు |
| సద్ద | సజ్జ ధాన్యం |
| సంకటి | సంకటి, అంబలి |
| సందు | మధ్య, వీధి |
| సర్గలు | భాగాలు |
| సాకు | పెంచు, పోషించు |
| సామీ | స్వామి(గౌరవార్థక సంబోధకం) |
| సాలు | పోలిక |
| సుగాశీలు | బంజాగీలు |
| సుద్దంగా | పూర్తిగా |
| సుమారు | ఒకమాదిరి, పరవాలేదు<br>ఉదా. జ్వరం సుమారుగా<br>ఉంది (C)<br>జ్వరం ఒకమాదిరిగా<br>ఉంది (MST) |
| సూదులువేయు | ఇంజెక్షన్‌చేయు |

| | |
|---|---|
| సూలు | గర్భవతి అయిన |
| సెలవుచేయు | ఖర్చుచేయు |
| సేద్దెగాడు | సేద్యం చేయువాడు, జీతగాడు |
| సేద్యం | వ్యవసాయం |
| సైనా/చానా | చాలా |
| సైతబడి | శాతబడి |
| సొత్తులు | ఆస్తులు |
| సొంతగాళ్ళు | యజమానులు, బంధువులు |
| సొప్ప | పశువులు మేసే చొప్ప (మేత) |

TELUGU AKADEMI

TELUGU DIALECT BULLETIN SERIES-6

CHITTOOR DISTRICT.